# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపక సంపాదకులు : **విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.**

సంపుటము 14 — రాజమహేంద్రవరము 16-9-1991, 1-10-1991 — సంచికలు 18, 19


—. ఈ సంచికలో రచయితలు .—

1. డా॥ మిరియాల రామకృష్ణ
2. శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్
3. శ్రీ ఎం. డి. జహాంగీర్
4. డా॥ టి. బాలసుబ్బయ్య
5. శ్రీ పోతేపెద్ది రాధాకృష్ణమూర్తి
6. డా॥ [illegible]
7. శ్రీ [illegible]
8. డా॥ గుమ్మా సాంబశివరావు
9. డా॥ జి. యస్. [illegible]


1, 16 తేదీలలో ప్రచురింపబడును.

సంవత్సర చందా రు. 20-00 — 6 మాసములకు రు 12-00 — విడి ప్రతి రు 2-00

## సంపాదకుని మాట

విద్య పరమ పవిత్రమైనది. దానికిసాటి మరొక సంపద లేదు. ఒకనాడు విద్యానార్జనకోసం గురుశుశ్రూష చేసి, చాల కష్టపడి విద్య నార్జించెడివారు. విద్యార్థులను గ్రహించి గురువులు వారిని నిష్ణాతులుగా చేయడంకోసం దీక్షతో విద్యాదానం చేసెడివారు. ఈనాడు గురుశిష్య సంబంధం పూర్తిగా లౌకికపరమైపోయినది. సామాన్యులు పిల్లలను చదివించాలంటే అప్పులు పాలవ్వవలసిన స్థితి ఏర్పడినది. విద్యారంగం మరొకరకమైన వాణిజ్యరంగంగా మారినది. దీనికి లోపం ఎక్కడున్నది? వేలు లక్షలు ఖర్చుపెట్టి సీట్లు కొనుక్కోవలసిన స్థితి అతి చిన్నతరగతి నుంచి పెద్ద చదువులవరకూ చీడలా ప్రాకినది. మేధావివర్గం ఈ విషయంలో తీవ్రంగా ఆలోచించి సరైన చర్యలు తీసుకోనకపోతే విద్యయొక్క పరమావధి అర్థాన్ని కోల్పోతుంది. అది సమాజానికి శ్రేయస్సుకాదు.

విద్యార్థులు శ్రద్ధగా చదువుకునే పరిస్థితులు సామాజికంగా ఈనాడు కుంటుపడ్డాయి. గురువులు విద్యాదానం చేసే రోజులు పోయి అనేక విమర్శలకు గురయ్యే విధంగా పరిస్థితులు మారినవి.

ఇది భవిష్యత్తును చీకటి చేస్తుంది. వెలుగుకోసం ఏమి చెయ్యాలన్నది ప్రతి ఒక్కరూ చిత్తశుద్ధితో ఆలోచించవలసిన సమయం ఇది.

—సంపాదకుడు

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.


## బ్రహ్మశ్రీ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి స్మారక సాహిత్య పురస్కార సభ

రాజమండ్రి గౌతమీగ్రంథాలయంలో 17-9-1991 న జరిగిన "విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి స్మారక పురస్కార సభ"కు ప్రఖ్యాతకవి శ్రీ ఆవంత్స సోమసుందర్ అధ్యక్షత వహించారు.

అత్యాధునిక కవిత్వానికి 1980 దశకం స్వర్ణయుగం. భావాలలో తీవ్రమైన మార్పులు దశాబ్దాలుగా కూర్చుకుంటూ 1940 నుండి 1980 వరకూ పరిణామాలు పొందుతూ 1980 నుండే స్థిరరూపకల్పన జరిగింది. ఉత్తమ కవులు చాలామంది 1980 దశకంలో రచనలు చేశారు. అంతేకాదు మైనారిటీలైన సోదర ముస్లింలలో ఎంతోమంది తెలుగు కవులు విలసిల్లారు. యువతీలలాదులు గణనీయ కవిత్వం వ్రాశారు. పీడితవర్గాల గురించి కూడా మంచి కవిత్వం వచ్చింది. జాషువాకవి ఆధునిక భావాలతో రచనలు చేసినా పద్యరచనలో కొట్టుకుపోయారని శ్రీ సోమసుందర్ అభిప్రాయపడ్డారు.



రామరాము భావాలలోనే ఆధునికతకాక అభివ్యక్తతలోకూడా ఆధునికత పెరిగిందన్నారు. భావాలలో, అభివ్యక్తతలో కూడా ఆధునికత పెరిగిందన్నారు. భావాలలో అభివ్యక్తతలో కూడా ఆధునికత ఉన్న మంచి కవి శ్రీ శిఖామణి అంటూ "మువ్వల చేతికర్ర"లో కొయ్యకాటా అనే కవితను ఆయన మెచ్చుకున్నారు. భావుకతేకాక తాత్త్విక ప్రజ్ఞ గర్భితంగాఉన్న కవి శ్రీ శిఖామణి అన్నారు. విశ్వవిద్యాలయ పరిశోధనా గ్రంథాలు చాలామట్టుకు రొడ్డకొట్టుడు పద్ధతిలో ఉండడం విచారకరమంటూ శ్రీ సోమసుందర్ శ్రీ సి. నారాయణరెడ్డి గారి ఆధునిక కవిత్వము - సంప్రదాయములు అనే గ్రంథంనుండి నేటివరకు వచ్చిన పరిశోధనా గ్రంథాలను సరిగా విమర్శించవలసిన అవసరం వుందని తమకా సంకల్పం వుందని అన్నారు.

తీసెప్పులకు అవార్డులు ఇవ్వడం సరైన పద్ధతి కాదని శ్రీ సోమసుందర్ అభిప్రాయపడ్డారు. సృజనాత్మక రచనలకు అవార్డులివ్వడమే మంచిదంటూ శ్రీ బులుసువారి అవార్డులు ప్రతియేటా ఇవ్వాలని సూచిస్తూ తండ్రి కీర్తిశేషులైన తరువాత వారి పేరుతో సాహిత్య పురస్కారా లేర్పాటుచేసిన శ్రీ సీతారామశాస్త్రిగారి పుత్రులను శ్రీ సోమసుందర్ అభినందించారు.

ప్రఖ్యాత కవి విమర్శకులు శ్రీ అద్దేపల్లి రామమోహనరావు సభా ప్రారంభం చేస్తూ తన విశ్లేషణా ప్రవచనంలో 1980 నుండి ఆధునిక కవిత్వానికి స్వర్ణయుగం అనే శ్రీ సోమసుందర్ గారి అభిప్రాయంతో నిర్ద్వంద్వంగా విభేదించారు. ఆధునిక కవిత్వంలో స్వర్ణయుగ ప్రారంభం అని అనుకుంటే అది 1970 దశకంనుండే అన్నారు.

కవులకు పురోగమన భావాలుండాలా తిరోగమన భావాలుండాలా అనేది రచనల్లో నిబద్ధత అనేది 70 దశకంలోనే ప్రారంభమైంది కవి కేవలం సిద్ధాంతం చెప్పి వూరుకుంటే సరిపోయే రోజులు మారిపోయాయి. ఇటీవల 8, 9 మంది ఆధునిక కవుల కేసెట్టు రిలీజవడం హర్షణీయమని అందరి భావాలు కోరుకోవు. అభివ్యక్తతా ప్రత్యేకతలతో రాణించాయి. కవిత్వంలో అనుభూతిని గురించి చెబుతూ శ్రీ అద్దేపల్లి అనుభవం వేరు. అనుభూతి వేరు అని తెలుసుకోవాలన్నారు. భోజనం చేయడంకూడా అనుభూతి అంటే ఎలా అని ఆయన ప్రశ్నించారు.

మనస్సును దేనితో దూరంగా తీసికెడుతుందో అదే అనుభూతి అన్నారు. శిఖామణి కవిత్వం మువ్వల చేతికర్రలో అనుభూతి వుంది. మునిలాడు కవిత అవిస్మరణీయం అన్నారు. ఈ సందర్భంలో శ్రీ అద్దేపల్లి ఫెమినిస్టులు వెర్రితలలు వేసే రచన చేయరాదని సలహా ఇచ్చారు. మృచ్ఛకటికం,ఆముక్తమాల్యద వంటి గ్రంథాల్లో దారిద్ర్యం వంటివి సామాజిక విషయాలు వ్రాస్తే అటువంటివి మీ సృష్టి కి నా అనే నభిక్కు ప్రశ్నకు శ్రీ రామమోహనరావు సమాధానం చెబుతూ నా సంకలనమూలను ఆ కవులు వ్రాశారనేది యదార్థమేకాని ఆధునిక కాలంలో వాస్తవికత ఉద్యమంగా భాసించిన రోజులతో నిండిందన్నారు. ఆర్థికాది విషయాల కనుగుణమైన ఆలోచనలతో ఉద్యమాభిముఖంగా వర్తమానకాలంలో వికసించిందన్నారు.

రాజమండ్రిలో సాహిత్యరంగంలో నభూతనవం,చైతన్యం,పట్టుదల ప్రశంసనీయాలన్నారు.

ప్రఖ్యాతకవి, విమర్శకులు శ్రీ మిరియాల రామకృష్ణ అవార్డు పొందిన శ్రీ వందుల గోపాలకృష్ణమూర్తిగారి మహాభారతం-ఔపదేశిక ప్రవృత్తిపై మాట్లాడుతూ భారత పాత్రల స్వభావ స్వభావాలు-వానిని గ్రహించి ఔపదేశిక ప్రవృత్తిని శ్రీ వందుల విశ్లేషించిన తీరు ప్రశంసాపూర్వమన్నారు.అనుభూతి,నిబద్ధత, శివేతరక్షతి వంటి కావ్యవిషయాలపై శ్రీ మిరియాల ప్రసంగించారు.

ప్రముఖ కవి శ్రీ కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ రాజమండ్రి సాహిత్యరంగంలోఉన్న విలక్షణం మూడు రకాల అవార్డుల ప్రదానంలో నిబిడీకృతమై వుందన్నారు. సహృదయ వాతావరణ లక్షణం ఈ వూరి గొప్పతనమన్నారు. ఆ లక్షణానికి సమాలోచన సంపాదకులు సీతారామశాస్త్రి దాఖలాగా వుండేవారన్నారు. శిఖామణి మువ్వల చేతికర్ర నిస్సందేహంగా గొప్ప కావ్యమన్నారు. శ్రీశ్రీ, సోమసుందర్ వంటివారు మహాప్రస్థానం, వజ్రాయుధం వంటి కావ్యాల నామకరణాలు సహితం వాచ్యంకాని అర్థాలను సూచ్యం చేసేవని తెలుపుతూ- మువ్వల చేతికర్ర కవిత్వపర నామకరణమన్నారు. మార్క్సిజమైనా, అద్వైతమైనా మానవాళి సుఖించడానికే. మానవసృజన మానవ కల్యాణానికే వినియోగమవాలి.

కొండలు, నదులు వంటివి స్వయంభవాలు. వీణలు వంటివి మానవ సృజన సంబంధితాలై ప్రయోజనదాయకమవుతున్నాయి.

ఏ సిద్ధాంతమైనా కవి అనుభవాన్నుండి భవిష్యత్తును సందర్శించడానికే అడ్డం రాకూడదు. మానవజాతిని తరింపజేయడానికై భవిష్యత్తులో వికసించే సిద్ధాంతాలకు బీజాలావన జరగకుండా సిమెంటు నష్టాలక్రింద కవిమేధ నలిగిపోరాదు అంటూ శ్రీమన్నారాయణగారు శిఖామణి కవిత్వం ప్రాకృతికమైన అనుభూతికి ఆలోచనలకు దర్పణమైన కవిత్వం అన్నారు.

ప్రఖ్యాత పండితులు శ్రీ చిర్రావూరి శ్రీరామశర్మ అవార్డుపొందిన కందుకూరి శ్రీరామచంద్రమూర్తిగారి వ్యాఘ్రేశ్వర విలాసంపై మాట్లాడుతూ ప్రాచీన కవిత్వం, సాహిత్యం, సంప్రదాయాలూ అధ్యయనం చేయకుండా విమర్శించే ఆధునికులను ఆయన విమర్శించారు. వ్యాఘ్రేశ్వర విలాసం సాంప్రదాయిక మార్గంలో చక్కని కావ్యం అన్నారు.

శ్రీ శర్మ రామాయణాదుల నుండి శ్లోకాలు, సూక్తులు చదివి వివరించారు.

మేఘాలు ఉప్పునీటి సముద్రంనుండి నీటిని స్వీకరించి తిరిగి వర్షిస్తాయికాని నదులు, మానులనుండి గ్రహించకపోవటం గమనించాలి. పరిపాలకులు మేఘాల వలె వుండాలని ప్రాచీన కావ్యాలు చెబుతున్నాయన్నారు. ప్రాచీన కవితయైనా, ఆధునిక కవితయైనా సంకుచితత్వం లేని కవిత్వమే సమాజానికి ప్రయోజనకరమని వివరించారు.

తొలుత శ్రీ బులుసు వెంకటేశ్వర్లు స్వాగతం చెబుతూ అవార్డుల గురించి, తమ తండ్రిగారి ధ్యేయం, జీవిత విశేషాల గురించి ప్రసంగించారు. అవార్డులు పొందిన శ్రీయుతులు శిఖామణి, సందుల, కందుకూరి లను బులుసు సీతారామశాస్త్రిగారి కుమారులు వేయినూటపదహార్ల నగదు, జ్ఞాపిక, శాలువాలతో సాంప్రదాయికంగా సన్మానించారు. వేదికపై ఆసీనులైన వారికికూడా సన్మానాలు చేయబడ్డాయి. అవార్డుగ్రహీతలు సముచితరీతిలో కృతజ్ఞతలు తెలిపారు. శ్రీ బులుసు భాస్కర శ్రీనివాస్ సముచితంగా వందన సమర్పణ చేశారు.

(*.*)



మను చరిత్ర పునశ్చరణం - 6

# వసంతంలో వరూధిని మనస్తాపం

— డాక్టర్ మిరియాల రామకృష్ణ

చివురాకుల పరుపుమీద పడుకున్నా, వరూధిని కేమీతోచలేదు. మనసు వ్యామోహంలో మునిగిపోయి ఉంటే, దేహం ఆనందంలో తేలుతుందా? పడుకోవడం మానేసి, లేచికూచుంది వరూధిని. మనసులోని దుఃఖం కన్నీరుగా మారిపోయి, కళ్ళనిండా ప్రవహిస్తోంది. కానిప్పుడేం చేయాలి? చుట్టూరా చూస్తే ఎందరో ప్రేయసీప్రియులు జంటలు జంటలుగా ఆ ప్రాంతాల్లో హాయిగా విహరిస్తున్నారు. తానొక్కతేనా ఇలా ఒంటరిగా ఉన్నది? అనిపించింది.[1]

చెలికత్తెలెందరున్నా ఆమె ఒంటరిదే కావడం గమనిస్తే మనకనిపిస్తుంది కామం (Lust) ఇంత పెద్దదా? అని. తీరని ఆమె కామకాంక్ష మొదట దుఃఖం (Grief) గా పరిణమించింది. ఈ దుఃఖాన్ని తొలగించుకోడానికి మార్గమేదైనా ఉందా? మనస్తత్వ శాస్త్ర ప్రకారం చూస్తే ఇలాంటి కామజన్య దుఃఖాన్ని తొలగించుకోవడానికి మనస్సుని మరోవైపుకి మళ్ళించడమే. దేని వల్ల ఇంద్రియాలకు ఉపశాంతి లభిస్తుందో దాన్ని వెదుక్కోవడం తగిన పద్ధతి. మనస్సుకి ద్వారాలే ఇంద్రియాలు. కానీ ఈ యింద్రియాలన్నింటికీ ప్రధాన ద్వారం నేత్రమే. ఈ నేత్రానికి ఉపశాంతి కలిగిస్తే మనస్సుకి వెంటనే మరో ప్రవృత్తి కలుగుతుంది. ఈ అన్య ప్రవృత్తి కల్పనే కామప్రవృత్తికి విరుగుడుగా (sublimation) చెబుతారు శాస్త్రకులు.

పెద్దనగారి వరూధినికి ప్రకృతి సౌందర్యం (Beauty of the Nature) చూడాలనిపించడంలో ఈ సత్యంఉంది.[2]

అది వెన్నెలరాత్రి అని ముందే చెప్పుకున్నాం. పైగా అది వసంతకాలం కూడాను. మన్మథుడి ప్రభావం ముందే మనస్సుమీద ప్రసరించాకా, వసంతకాలపు వెన్నెలరాత్రి దేహానికెలా ఉపశాంతి నిస్తుంది? కామవాంఛకి ఇవన్నీ ఉద్దీపనాలే (Stimulators) అందువల్లనే వరూధినికి వెన్నెల వేడిగా కనిపించింది. ఆమె తట్టుకోలేకపోయింది. పైటచెరగుని తలమీదికి గొడుగులా కప్పుకోవలసివచ్చింది.[3]

ఆమె చెలికత్తెలతో తన కేళీవనంలోకి బయలుదేరింది. కాని ఆ వనంలో మాత్రం ఆమెకు అనుకూలంగా ఉండే వాతావరణం (Environment) ఉందా? ఎలా ఉందా వాతావరణం? ఆమెకు ప్రతికూలంగా ఉంది. ఆ వాతావరణం చూశాకా, ఆమెకు అక్కడే చచ్చిపోవాలనిపించింది.[4]

సువాసనలతో నిండిన చల్లని గాలి, చివురాకుల చిట్టిపొదలూ, అల్లిబిల్లిగా అల్లుకున్న తీగలూ, తేటతేటగా ప్రవహిస్తున్న వెన్నెల, తుమ్మెదలూ, పుప్పొళ్లూ మామిడిచెట్లూ ఇలాంటివన్నీ ఎంతో ఆనందాన్నివ్వవలసింది పోయి, ఆమెకు దుఃఖాన్నే కలిగించాయి.

ఇక్కడొక సత్యం వ్యక్తమవుతుంది. సుఖం (Delight) అనేది బాహ్య వాతావరణంలోంచి రాదు. మానసాంతరంనుంచి పైకి వచ్చే భావమే సుఖం. బాహ్యవాతావరణం దానికి ఆధారం మాత్రమే. మనసు బాగుండనపుడు సమస్త సౌందర్యమూ ఎలా వికృతంగా కనిపిస్తుందో పెద్దనగారిక్కడ అద్భుతంగా వ్యక్తం చేశారు. 'అందమైన వస్తువు లానందాన్నిస్తాయి' అనే భావన అడ్డం తిరిగే సందర్భాలు మానవజీవితంలో తారసపడుతూ ఉంటాయి.

ఆమె మరణించాలనుకుంటే చెలికత్తెలూరుకుంటారా? వద్దు వద్దని వారించారు. ఓదార్చారు. కన్నీరు తుడిచారు.[5]

చెలికత్తెలు వరూధినిని ఊరుకోపెట్టడంలో మనకేం కనిపిస్తుందంటే ఏ ఆత్మగౌరవాన్ని అయితే ఏ ధైర్యాన్ని అయితే వరూధిని జారవిడుచుకుందో దాన్ని తిరిగి ఆమెకు కలిగించాలనే తపన కనిపిస్తుంది.[6] అంతేకాదు లోకంలో స్త్రీలు చక్షుఃప్రీతికి లొంగిపోవడం అంత మంచిది కాదంటారు వాళ్ళు. చక్షుఃప్రీతి కోరికలకు మూలాధారం. ముఖ్యంగా లైంగిక వాంఛ (Sexual desire) కు దారితీసేది ఈ చూపులలోని దోషమే. స్త్రీ దాన్ని విడిచిపెట్టాలంటారు ఆ చెలికత్తెలు. వివాహానికి ఈ నీతి స్త్రీ పురుషులిద్దరికీ సమానంగా వర్తించేదనడంలో సందేహంలేదు. ఈ విషయాన్ని పెద్దనగారు ఆదర్శం (ideal) గా స్ఫురింపచేయడానికి ప్రయత్నించి, ప్రవరుడు ఏవిధంగా నయనప్రీతికి వశమైపోలేదో చెబుతూనే వచ్చారు. అందుకే ప్రవరుడికి లైంగికవాంఛ కలగకుండా పోయింది. దీనికి కారణం ప్రవరుడి బుద్ధిశాలిత్వం (Wisdom). అయితే ప్రవరుడికి లైంగిక వాంఛే లేదనుకోవడం పొరపాటు. అతను గృహస్థజీవితంలో దాన్ని ధర్మంగా భావించాడు.

వరూధినికి చెలికత్తెలు మరో వాస్తవం గుర్తుచేశారు. అది వసంతకాలం కావడంవల్ల మన్మథుడి ఆటలు మితిమీరుతున్నాయన్నారు. వెన్నెల బాధిస్తున్నదని కేళీవనంలోకి వస్తే కేళీవనంలో వసంతం ఉందనీ, వసంతంతోనూ, వెన్నెలతోనూ కలిసి మన్మథుడు చెలరేగుతున్నాడనీ వివరించారు.[7]

ఒక బాధనుంచి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తే మంచిదేకానీ అంతకు రెట్టింపు బాధని కొనితెచ్చుకునే మార్గంలోకి పోవడం వివేకం (Wisdom) కాదని వాళ్ళ మాటల్లోని సాధారణ ధ్వని (general suggestion).

పెద్దనగారు ఈ సాధారణ ధ్వనిని బలంగా స్థాపించారు ఎలాగంటే ఈ సందర్భంలో ఆయన చెప్పిన ఉపమాలంకారం వల్లనే. కాలిలో ముల్లు గుచ్చుకుంటే దాన్ని తొలగిద్దామని చెప్పి, ఇనుపమేకు గుచ్చితే. ముల్లు ఊడిపోయి. మేకు కాలిలో దిగబడిపోయిందన్నది ఆ ఉపమాసామగ్రిలోని చిన్నకథ.[8]

వరూధిని వనవిహారం చాలించి ఇంటిముఖంపట్టింది—చెలికత్తెల సలహాల ననుసరించి తన మందిరంలో మళ్ళీ పాన్పెక్కి పడుకుంది. కానీ ఆమె వెన్నెల వేడిమినింకా భరించలేకపోతోంది. ప్రబంధాల్లో చంద్రోపాలంభనం సాంప్రదాయికంగా ఉంటుందని మన మనుకుంటాం గానీ ఇక్కడ తత్త్వం ఆలోచిస్తే వేరొకలాగ బోధపడుతుంది. వరూధిని చంద్రుణ్ణి తిట్టిపోసిన మాటనిజమే. కానీ ఇందులోని రహస్యం ఏమిటి?

వరూధిని కామవాంఛ వ్యర్థమైపోగా, ఆ వ్యర్థమైన కామవాంఛ కోపం (anger) గా మారింది. ఆ కోపం ఎవరి మీద? పరిస్థితులమీదనే. పరిస్థితులంటే ఏమిటి? ఇక్కడి పరిస్థితి ప్రతికూల నిశాకాలమే. ఆ నిశాకాలానికి కారణం చంద్రుడే. ఆ చంద్రుడి మీదనే ఆమె మొదటికోపం ప్రసరించింది ఆమె చంద్రుణ్ణి నిందించింది. అవి 8 పద్యాలున్నాయి.[9]

ఈ చంద్రనిందలో పెద్దనగారుసాధించిందేమిటి? అని అడగండి. నాకేమనిపించిందంటే పెద్దనగారు కావాలనే (consciously) సమకాలీన రాజకీయ సామాజిక స్పృహ (political and sociological consciousness) ను ఈ చంద్రనిందలో వ్యక్తంచేశారు. తాను కావ్యం రాసేకాలంలో మహమ్మ

(తరువాయి 18వ పేజీలో)

# ఎఱ్ఱన కవిత్వము - జనజీవితము

—ముదిగొండ ఈశ్వరచరణ్

(గత సంచిక తరువాయి)

సమాజం_సాహిత్యం రెండూ బింబ ప్రతిబింబాలు. సమాజాన్ని విస్మరించిన సాహిత్యానికి రీతి, సాహిత్యాన్ని విడచిన సమాజానికి నీతి ఉండవు. ఈ సత్యం భారతీయాలంకారికులకు, ప్రథమాంధ్ర మహాకవులకు బాగా తెలుసు.

'కావ్యం యశసే_అర్థకృతే_వ్యవహార విదే_శివేతర క్షతయే_సద్యః పరనిర్వృతయే_కాంతాసమ్మిత తయోపదేశయుజే' అని ఆచార్య మమ్మటుడు నిర్వచించగా, ఆంధ్ర శబ్ద చింతామణికారుడు 'విశ్వ శ్రేయః కావ్యం' అని నిష్కర్ష చేశాడు.

పశుబలం నిర్బలత్వంమీద_ అబలత్వం మీద జరిపిన అత్యాచారాన్ని నిరసిస్తూ లౌకిక సాహిత్యంలోని మొట్టమొదటి శ్లోకం అవతరించింది. ఆ శ్లోకానికి కర్త నిరీషుడు_నిస్సంగుడుఅయిన శాంతతపస్వి. అయినా తన కళ్ళముందు జరిగిన అత్యాచారాన్ని చూచి సహించలేక తిరుగబడ్డాడు. ఆ మొదటి తిరుగుబాటు కేవలం మానవ సమాజానికి మాత్రమే పరిమితమైంది కాదు. సరిగా గుప్పెడులేని పక్షి ఆర్తనాదం విని తన కవితారూపమైన తిరుగుబాటు బావుటా ఎగురవేశాడు ఆ ఆదికవి.

ధర్మాన్ని_సత్యాన్ని తన ప్రాణాలొడ్డయినా దక్షుడు రక్షించాలి. అలా రక్షించడంలో ప్రాలుమాలితే సత్యధర్మాలకు ఎప్పుడూ చేటు చేకూరదు. కాని ఉపేక్షించిన ఆ దక్షుడు తన ఉపేక్ష చేత దహింపబడతాడు అన్న సార్వత్రిక సత్యనిరూపణంకోసం నాలుగు వేదాలను, 18 పురాణాలను, ఒక ఇతిహాసాన్ని విభజించి, వివరించి రచించాడు వ్యాస భగవానుడు.

అమితాఖ్యానక శాఖలతో వేదార్థామలచ్ఛాయమై సుమహావర్గ చతుష్క పుష్ప వితతితో ప్రకాశించే మహాభారతాన్ని జగద్ధితాన్ని కోరి తెలుగుచేయడం ప్రారంభించాడు వాగనుశాసనుడు.

దుష్టులు_దుర్వినీతులు లోకానికి అపకారం తలపెట్టినప్పుడు వ్యక్తి తనను తాను దహించుకొనైనా సమాజ పరమేశ్వరుడిని మేల్కొల్పాలని తన కావ్యం ద్వారా ప్రబోధించాడు కవిరాజ శిఖామణి.

మతవైషమ్యాలు కత్తుకలు తిరిస్తున్న కాలంలో కవిత్వం ఒక ఆరాధనా విశేషమని ఆంధ్రావళి మోదమున బొరయ హరిహరనాథుల సమైక్య స్వరూపాన్ని ఆవిష్కరించి కవిత్వ మహావిభూతికి పట్టం కట్టాడు కవిబ్రహ్మ.

బాధాసర్పదష్టులు, వ్యథాచలితహృదయులు అయిన అణగువర్గాలను, బడుగు వర్గాలను కవితాపల్లకి ఎక్కించి ఊరేగించి సాహిత్య సామ్రాజ్యానికి సార్వభౌములను చేశాడు పాల్కురికి సోమన్న.

ఇది వారి కవితాదుందుభి మ్రోగించిన సామాజిక దృక్పథం. ఇక్కడ ఒక్క విషయాన్ని గుర్తుంచుకోవాలి. వారెవ్వరూ వివాదాలకోసం కవిత్వం వ్రాయలేదు. వివాదాలకోసం మతతత్వాన్ని కోరలేదు. సమాజం తమకు ప్రసాదించిన ప్రతిభను, వ్యుత్పత్తిని సమాజంకోసమే వినియోగించారు. అందుకే వారు చిరంజీవులయ్యారు. వారి కావ్యాలు మూర్ధాభిషిక్తాలైనాయి.

సార్వకాలికం, సార్వజనీనం అయిన ఆ వారసత్వానికి ప్రతినిధి ఎఱ్ఱయగారు. తన దేశం, తన జాతి, తన సంస్కృతి, తన సంప్రదాయం, తన ధర్మం పారము పొందలేక చెడబారిన వేళలో ఆయన రామాయణం వ్రాశాడు. హరివంశం చెప్పాడు. అరణ్యపర్వం పూరించాడు. నృసింహపురాణం రచించాడు.

వీటిని ఆయన కీర్తికండూతితో వ్రాయలేదు. డబ్బుమీద పేరాసతో వ్రాయలేదు. సన్నదులకోసం, సన్మానాలకోసం వ్రాయలేదు. తన దేశాన్ని రక్షించుకోవడంకోసం, తన జాతిని మేల్కొల్పడంకోసం వ్రాశాడు.

ఆయన వ్రాయాలనుకొన్నది, వ్రాసింది ఒక కథ కాదు. కథాగతమైన శిల్ప వైచిత్రి కాదు. ఆ వైచిత్రికి కారణమైన రసాభ్యుచిత పదబంధం కాదు. ఆయన కోరుకున్నది ధర్మసంస్థాపనం. సత్య నిరూపణం.

ఆ రావణుడు ఎలాంటివాడు? తపస్సు చేత, పరాక్రమంచేత మూడులోకాలవారికి అజేయుడైనవాడు. అయినా స్త్రీ వ్యామోహంవల్ల కోతులచేత, కొండముచ్చులచేత వంచింపబడ్డాడు. వంశవినాశకుడయ్యాడు.

కంసుడు, కాలకేయుడు, నరకుడు ఒక్కొక్కడు ఒక్కొక్క లోకాన్ని దిగమింగగల సమర్థులు. అయినా అహంకారం, అహంభావం మెచ్చుమీరి సమాజం పాలిట కీచకులై ఒక గొల్లపిల్లవాడి చేతుల్లో ఆత్మవినాశనం కొనితెచ్చుకున్నారు.

పరుల సొమ్ముమీది ఆశతో నూర్గురు తమ్ములకు అగ్రజుడై, వీరాధివీరులకు

ధయ కవిత్వం చేర నిర్బంధకవిత్వం, నిర్లక్ష్యకవిత్వం వస్తున్న ఈ రోజుల్లో అడ్డుగానిలువు గాతదనం రాని కవిత్వమనిపించే కవులను ప్రశ్నించినాడు.

8. అవినాభావంలో

అన్నికష్టాలకన్నా ఆత్మవిశ్వాసమే మిన్న
అదిలేకున్న అభ్యుదయం సున్న.
అని ఈనాటి అభ్యుదయ రహస్యాన్ని తెలిపినాడు.

9. మృత్యుభీతిలో;

కవి పుట్టిన ప్రతిజీవికి గిట్టుట తప్పదు. కనుక ప్రతిమానవుడు బ్రతికినంతకాలం మృత్యుభయం విడిచి జీవించవలె. పుష్పం వికసించి తన అందాన్ని పరిమళాన్ని పలువురికి విందుచేసి ఆ తరువాత నిశ్చింతగా రాలిపోతుంది మానవుడు కూడా అదేవిధంగా బ్రతికినంతకాలం పుష్పం వలె బ్రతకవలె అంటాడు.

ఈ విధంగా ఇందులో ఇంకా జీవిత సత్యాలు, మానవత ఏదైనా ఎందుకు, త్యాగస్వరూపం, నీవూ ఒక మనిషివేనా, ప్రకృతిపాఠం, అందుకే ఈదినాలు, నిజం' మనంసాధించిందేమిటి, సిగ్గుచేటు, నాపేరు లంచగొండి అనే శీర్షికలున్నవి. లంచగొండిలో_

నాపేరు లంచగొండి, దమ్ములుంటె
పట్టుకోండి
ఢిల్లీలోఉన్నాను, పల్లెలో ఉన్నాను.
అవసరాన్ని బట్టి ఆకారంమారుస్తుంటాను
విచ్చలవిడిగా విహరిస్తుంటాను, ఐనా
నన్నెవరు పట్టుకోలేరు_

ఈనాటి లంచం యొక్క స్వరూపాన్ని దాని సర్వవ్యాపకత్వాన్ని చాలా నిర్భయంగా చెప్పినాడు. ఇందులో చెప్పిన ప్రతిమాట సత్యంగా ఉంది.

# వేదుల సూర్యుని జ్ఞానమహస్సు

— డా. టి. బాలసుబ్బయ్య

కళాప్రపూర్ణ, సరస్వతీ కంఠాభరణ, తత్త్వార్థ ప్రబోధక, విద్వాన్ డా వేదుల సూర్యనారాయణ శర్మగారిని ఆంధ్ర సాహిత్యలోకానికి ఎవరూ ప్రత్యేకంగా పరిచయం చేయనవసరంలేదు. వారు ఆర్యచాణక్యుడు, కాకతి ప్రోలరాజు వంటి చారిత్రిక నవలలు, లక్ష్మీసహస్రకవ్యం. శ్రీసౌందర్యలహరి బుద్ధగీతవంటి అనువాదకృతులు, నరేంద్రుడు మొదలగు నాటినాంధ్రకృతులు అంతరార్థ రామాయణ భారతాది విమర్శ గ్రంథాలు మొదలైనవి రచించి గొప్పగ సాహిత్య ప్రపంచాన్ని తమ బహుముఖ నిశిత ప్రజ్ఞాపాటవాలతో వెలయించినమహామనీషి. ప్రాచార్యులు మామిడిపూడి వెంకటరంగయ్యగారు, శతావధానులు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు, విమర్శకాగ్రేసరులు కట్టమంచి రామలింగారెడ్డిగారు వంటి పలువురు ప్రజ్ఞానిధుల ప్రశంసలందిన లబ్ధప్రతిష్ఠులు. వీరిని ఒక వ్యక్తిగాకాక ఒక తత్త్వముగా ఆకళింపు చేసుకోవలసినదే.

'ఏమస్వయం జ్యోతి రశేషసాక్షీ
విజ్ఞానకోశేవిలసత్యజస్రమ్।
అత్యం విధార్యైన మసద్విలక్షణం
ఆఖండ తత్త్వాత్మకయానుభావయ॥'

అన్నట్లుగా స్వయంజ్యోతి, అశేషసాక్షి.

ఈసంపుటిలోని ప్రతిశీర్షికా పేరుకు సార్థకంగా ఉంది. భావప్రకటనలో ఎక్కడ కూడా అర్థక్లిష్టత లేకుండా రచన సరళంగాసాగింది.కవి ఇందులోఎక్కడా అతివాస్తవికతా కల్పనలో కొట్టుకొని పోలేదు. సామాజిక స్పృహను విస్మరించలేదు. చెప్పినంతవరకు రామిరెడ్డిగారు ఈనాటి సత్యాలను సూటిమెత్తగా చెబుతూ దీనిలో లోకాన్ని మందలించినాడు. ఇందులో ఈనాటి సమాజం కలిబిలిలేకుండా నిర్మలంగా ప్రతిబింబిస్తుంది. కాబట్టి ఓక చక్కని కవితా సంపుటాన్ని పాఠకలోకానికి అందించినందుకు శ్రీ. విరజాజిగారు అభినందనీయులు. ఇపుడు ఈ యువకలె అవగాహనతో వ్రాసేవారు తక్కువ కనిపిస్తారు.

దీనికి శ్రీ. కుందుర్తిగారి శ్రీ భగవానువాచ ముఖతిలకంగా ఉంది. అది కాలానికి తగిన ఎత్తుగడతో అభ్యుదయ కవితాగీతగా ఉంది. ఆధునిక కవులకు నిర్మాణాత్మకమైన సందేశాన్నిస్తుంది.

ఈనాడు సామాజికదృష్టికలిగి కవితావేశంతో పరవళ్ళు త్రొక్కుతున్న వారంతా తాము వెలువరిస్తున్న యిటువంటి సంపుటాలను పరస్పరం చదువుకుంటూ ఉంటే వాటిలోవారు, ఇంకా క్రొత్తగా రంగంలో కాలుమోపదలచే వారు కూడ ఎంతోస్ఫూర్తిని పొందుతూ ఉంటారు.

(*.*)

విజ్ఞానలోక విదితము, అయిన్నీ అటువంటి ఈ (జీవన) తత్త్వాన్ని అమృత మంచి అద్భుతమైన ఆత్మతత్త్వం చేతనే అనుభవించాలి కాని అది మాటలకు అం దేదికాదు.

శ్రీ శర్మగారు రచించిన అంతరార్థ రామాయణ భాగవత భారత దేవీభాగ వత విష్ణుపురాణాలలో వెలువరించిన అమూల్యాభిప్రాయ సిద్ధాంతాలయావం లో బహిర్గతమైన వారి ప్రజ్ఞాగాంభీ ర్యాన్ని పునరావృతం చేయడమే ఇట ప్రస్తుతం.

తమ అంతరార్థగ్రంథాల రచనా హేతువును 'నివేదన' మాటలలో శర్మ గారే ముందుగా పేర్కొన్నారు.

ప్రాచీనములైన భారతీయ వేదోపని షత్తులు, పురాణాలు, రామాయణ భారత భాగవతాదిగ్రంథాలు, శాస్త్రాలు మొద లైన సాహిత్యనిర్మాణంలో తత్త్వక ర్తలు పాటించిన సాంకేతిక పద్ధతి ఒకటి ప్రసిద్ధంగా కనబడుతుంది. ఈ సాంకేతిక విధానంలో ఆయాకృతికర్తలు తమ భావపరంపర శైథిల్యం పొందకుండ వుండడానికై అనేక కట్టులను ఏర్పాటు చేసినారు. భావుకులైన పాఠకులు తమ ధిషణా సంయమనంతో అకట్టులను అధిగమించినకాని ఆయాకవుల అంత రంగం ఆవిష్కరింపబడదు. అప్పుడే మన వైదిక వాఙ్మయంలో అధిభౌతిక, అధి దైవిక, ఆధ్యాత్మిక అర్థాలతో మూడు ముఖ్యాలనీ మూడురకాల భావాలుకల జనానీకానికి ఉపయోగార్థంగా మన మహర్షులు చెప్పిన విషయాలు క్రమంగా అవగతమౌతాయి.

ఆధిభౌతికమైన అర్థాలు మనిషిజీవి తాన్ని సుఖవంతంగా ధర్మమార్గంలో నడిపించడానికి ఉపయోగపడతాయి.

అధిదైవికమైన అర్థాలు అతీయానుభ విషయాలతో దైవంపై విశ్వాసం కలిగించి మనస్సును దృఢపరచి దైవోన్ముఖం చేసి దైవానుగ్రహం వల్ల జీవితాన్ని ధైర్యంగా సుఖవంతంగా నడిపించుకొనేటట్లు సం ఘాన్ని జాతిని ఉత్తేజితం చేస్తాయి.

ఆధ్యాత్మికార్థాలు మానవుని మన స్సులో జరిగే వాసనల గందరగోళాల న్నిటినీ ప్రశాంత పరచి సుఖశాంతు లతో జీవితాన్ని నడిపిస్తూ జీవాత్మను పర మాత్మలో కైవల్యం పొందే ముక్తిమార్గం వైపు నడిపిస్తాయి.

ఈ పై మూడుమార్గాలు వివిధమన స్తత్వం గల మానవులు అందరూ ఏకీభ వులై ఒకరితో ఒకరు విరోధులుకాకుండా నడవడానికి వేసిన మూడు బంధాలు. వేదంలోనే ఉన్న ఈ మూడు మార్గాలు భారత భాగవత రామాయణాల్లోనూ వివరింపబడిఉన్నాయి. ఈమూడుమార్గాల్లో మానవుణ్ని శాశ్వతంగా తరింపజేసేది ఆధ్యాత్మికమార్గమొక్కటే.

వేదాలలో కర్మ భక్తి యోగజ్ఞాన మార్గాలకు సంబంధించిన నిరాకార నిర్గుణ పరతత్త్వాన్ని అవగాహనచేసుకోవ డానికై పెక్కువిషయాలను సగుణ మార్గంలో సశాస్త్రీయంగా రూపకీకరణ చేయడం జరిగింది 'కల్పం' అనే వేదాం గం ఈవిషయాన్ని స్పష్ట పరుస్తుంది. "నిరుక్తం" అమూర్తాలైన తాత్త్వికార్థ పర ములైన ఏయే పదాల్ని రూపకీకరణం చేయడంలో, ఏసాకారపదాలతో - ఏని రాకార తాత్త్వికపదాలకు సామ్యం చెప్ప బడిందో విప్పిచెప్పింది. ఇక "వ్యాకర ణం" శబ్ద స్వరూపాన్ని చెప్తుంది. 'వేద నిగూఢతత్త్వ పరిశీలనం' అన్న వ్యాస సంపుటంలో శ్రీ అరవింద మహర్షి అం గ్లంలో యజ్ఞయాగాలలోని ఇటువంటి పెక్కు విషయాలను వివరించారు.

శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు రామాయణ భారతభాగవతాల్లోని కథ లకు అక్కడక్కడ పాత్రలచేత మాత్రమే చెప్పించబడిన అంతరార్థాలే ఉండటం గమనించి, వానికి ఆమూలాగ్రంగా కథా క్రమవిధానంతో అంతరార్థాలు చెప్పా లన్న బృహత్కార్యాన్ని తమపై వేసు కొని దాన్ని అద్భుతంగా నిర్వహించారు. ఎన్నో ఏళ్ళ నిరంతర తపః ఫలితమిది. వారు వ్యాకరణం, కల్పం, నిరుక్తంవంటి వేదాంగాలలో తలస్పర్శి పాండిత్యం కల్గి వుండటంతోపాటుగా, విషయాన్ని సాం దికగా పూర్వాపరాల సామరస్యంతో వివరించడంలో అసమాన్యమైన సంయ మనాన్ని ప్రదర్శించారు. వీనివల్ల, ఆయ నకు దైవదత్తమై నిసర్గంగా సిద్ధించిన కర్మ భక్తి యోగ జ్ఞానమార్గాలకు సంబం ధించిన వైదాంతిక పూర్ణయోగ సిద్ధాం తము వారి అంతరార్థగ్రంథాలవల్ల లోకా నికి సన్మార్గోపదేశం చేయడానికై తెలి సింది. వారి వేదాంత పరిజ్ఞానంకారణంగా రామాయణం 'జ్ఞానపీఠం'గా, భాగవతం "బ్రహ్మవిద్యాదర్పణం'గా, భారత ముక్తిసాధనామార్గంగా, శ్రీ దేవీభాగ వత-విష్ణుపురాణాలు' చైతన్యాద్వైతం' గా రూపుదిద్దుకొన్నాయి. ఇదొక జ్ఞాన యజ్ఞం.

మన కర్మకాండలోని విఘ్నేశ్వరపూజ మొదలు అశ్వమేధయాగం వరకు ఉన్న యాజ్ఞికకార్యక్రమ తతంగం అంతా కూడా వేదంలోని నిరాకార నిర్గుణ పర పరమాత్మ తత్త్వానికి రూపకీకరణ ప్రయ త్నమే అని పేర్కొన్నారు. శర్మగారు. వీరు ఉపనయనవ్రతంలోని 'చర్మధారణం' అంటే తోలుబంధ్యాన్ని ధరించడాన్నీ- అగ్ని ఉపాసనాకార్యక్రమంలోని అగ్నీ.

(సశేషం)

# కర్పూర వసంతరాయలు - భావసౌందర్యం

— పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి ఎం, ఏ., ఎం. ఫిల్.

కొంతకాలం నా పేరు వినిలే కర్పూర వసంతరాయలు కావ్యం గుర్తుకొచ్చేది. ఈ కావ్యం వెలువడిన తరువాత ఎందరో సహృదయులు నన్ను విశ్వంభర కవిగా సంభావించారు. అన్నారు డాక్టర్. సి. నారాయణరెడ్డిగారు-విశ్వంభర పునర్ముద్రణలో. నిజం! ఒక కవి తన సాహిత్యజీవితంలో ఎన్ని రచనలు చేసినప్పటికీ, పాఠకులు వాటిలో మేలుబంతిగా వున్న దాన్నే అమితంగా అభిమానిస్తారు. దానివలనే ఆ కవి కీర్తి విస్తరిల్లుతుంది. నారాయణరెడ్డిగారి రచనలలో 'కర్పూరవసంతరాయలు' 'తత్రశ్లోక చతుష్టయం', దానికి అంతటి ప్రఖ్యాతి రావటానికి కారణం అందులోని ఇతివృత్తం, రెడ్డిగారు దానిని నిర్వహించిన విధానం. ఈ విధానంలో అనేక విషయాలున్నై. ప్రస్తుతం అందులోని భావసౌందర్యాన్ని తిలకిద్దాం!

* * *

అది చైత్ర శుద్ధ త్రయోదశి. మదనదేవ పూజారంభ దినం. వంది మాగధులు కర్పూర వసంతరాయలు బిరుదాంకితుడైన కుమారగిరి రెడ్డిని గురించి స్తోత్రపాఠాలు చదువుతూ హైవారా అర్పిస్తున్నారు. ఆ గానామృత మాధుర్యానికి కొండవీటి పురంలోని బండల గుండెలు సైతం గలగలలాడి, అది కూడా గొంతెత్తి 'ఓం' అని వంతపాడినై. ఈ సందర్భంలో సినారె గారు రంగప్రవేశం చేసి, మనతో—

అది కొమరగిరి ప్రభువు
టంగనమ్మున వల్లె
లే కొల్లలై విరియు
లేత ఆమని యందు
నేను వేరుగ చెప్పనేల?
వ్యంజనకు వ్యాఖ్యానమేల? (పుట. 82)

అన్నారు ఉత్తమ పురుషలో. "కారే రాజులు? రాజ్యముల్ గలుగవే?" మరి కొమరగిరిలో వున్న ప్రత్యేకత ఏమిటి? అతని రసికహృదయం; కవితా హృదయం, అందులో నుండి ఉద్భవించిన వసంతరాజీయ నాట్యశాస్త్రం. ఆ గ్రంథావిర్భావానికి ప్రరోచన నర్తకీలకుమ; ఆ లకుమ అతనికి పరిచయమైంది ఈ వసంతోత్సవాలలోనే! కనుకనే ఆ దివ్యసుందర్యాన్ని అతని జీవితంలో పుష్పాలను వికసింపజేసిన వసంతంగా అభివర్ణించారు రెడ్డిగారు.

వ్యంజన అంటే ఏమిటి? ధ్వని! ధ్వనిలో వున్న అర్థాంతరాన్ని, కవిహృదయాన్ని పాఠకుడు తన బుద్ధిబలంతో స్వయంగా తెలుసుకోవాలి. లేదా వ్యాఖ్యాతను ఆశ్రయించాలి. అప్పుడు అతనికి కలిగే ఆనందానుభూతి ఆ ధ్వనిలోని మర్మాన్ని కవి వివరిస్తే కలగదు. అందుకనే రెడ్డిగారు 'వ్యంజనకు వ్యాఖ్యానమేల?' అన్నారు. 'కవిత్వం కప్పి చెబుతుంది, విమర్శ విప్పి చెబుతుంది' అంటే ఇదే!

నగరికోటలో మదనదేవుని పూజా కార్యక్రమం ప్రారంభం కాబోతున్నది ఆ సమయంలో కుమారగిరి ప్రక్కనే కూర్చొనివున్న అతని బావమరిది కాటయ వేముడు 'బావా! ముక్కంటి కంటి మంటలో బడి, శరీరాకృతిని కోల్పోయిన మన్మథునికి మీవంటి రసజ్ఞులే రూపాన్ని కల్పించాలయ్యా!' అన్నాడు పరిహాసంగా. అప్పుడు కుమారగిరి చిరుమందహాసం చేస్తూ రాణిగారి ఎడమ భుజాన్ని సుతారంగా నొక్కి, కాటయవేమునితో-

కాళిదాసు శకుంతలకు పా
ఠాలు నేర్పెడు బావగారూ!
మీ రసజ్ఞత మదనదేవ సు
మూర్తిని కాదనెదరా? (పుట.88)

అన్నాడు కాటయవేముడు మహావీరుడే కాదు. సాహితీపరుడు కూడా. అతడు కాళిదాసకృతమైన అభిజ్ఞాన 'శాకుంతల నాటకానికి-మిగిలిన రెండింటికి కూడా... గొప్ప వ్యాఖ్యాత్రాకాడు. శాకుంతలం శృంగారరస సర్వస్వం. శకుంతల నాయిక. వ్యాఖ్యాన సమయంలో శకుంతలాదుల సంభాషణలకు అర్థాలను, అంతరార్థాలను, విశేషాలను అతడు-స్వయంగా శకుంతలకు కూడా ఈ మనోభావం తెలిసి వుండేదేమో అని పాఠకులు ఆశ్చర్యచకితులయ్యే విధంగా-బహుధా వివరించాడు. అందుకే కుమారగిరి అతడిని 'శకుంతలకే పాఠాలు నేర్పినవాడివి; నువ్వు మాత్రం సామాన్యుడివా? బావా!' అన్నాడు. అభినవ నరనారాయణులు ఆ బావమరదుల సరసంలో ఇంత స్వారస్యం వున్నది.

రెడ్డిగారు చంద్రుడిని మదనుడి రథాగ్రం మీద వుండే ముత్యాల గొడుగుగానూ, వియోగుల పాలిట అగ్గిపిడుగుగానూ అభివర్ణించారు. చైత్రపూర్ణిమనాటి సాయం సంధ్యాసమయంలో అరుణవర్ణంలో చంద్రుడుదయించాడు. అతనిలోని అరుణిమను సినారె అపూర్వంగా ఉత్ప్రేక్షించారు.

వలరాచ ననచిగొను తలరు బోణుల జాబి
కనురెల్లు చేసినటు కం బారియును పించె.
(పుట. 41)

మన్మథ శాపాన్ని అందుకొనే పూబోణులను చూచి, చంద్రుడు కోపంతో కండ్లెఱ్ఱ జేశాడట. అందువల్లనే చంద్ర బింబం ఎఱ్ఱగా వున్నదట.

మన్మథుని అంతిమ బాణం లకుమ. శీతాంశుని పదిహేడవ కళ లకుమ. వసంతోత్సవాలలో ఆమె నాట్యాన్ని చూచిన కుమారగిరి లకుమా అన్న పంచప్రాణాలు దయ్యాడు. లకుమ కూడ అదే స్థితిలో వున్నది. రాణికిది మనోవేదనను కలిగించింది.

ఒకరోజు రాజు తన బహిఃప్రాణమైన లకుమతో కలసి రథాన్ని అధిరోహించి అహోబిలక్షేత్రానికి వెళ్ళాడు. సాయంకాలమైంది. సంధ్య ఎఱ్ఱబడ్డది.

అతి ధావన పరిశ్రాంత
మై సూర్యుని అశ్వసప్త
కము నెత్తురు గ్రక్కినదగ
కడ సంధియ యెఱ్ఱవారె. (పుట. 32)

అపరిమితమైన వేగంతో అవిశ్రాంతంగా పరిగెత్తటం వలన అలసిపోయిన సూర్య రథాశ్వాలు కక్కిన నెత్తురా? అన్నట్లుగా సంధ్య ఎఱ్ఱబడ్డదట.

రాజుకు లకుమ తోడిదే ప్రపంచమై పోయింది. వాళ్ళిద్దరు ప్రకృతి పురుషుల లాగా, వాగర్థాలలాగా, నదీసముద్రాల లాగా అవినాభావంగా, అభిన్నంగా, అద్వైతంగా కాలం గడుపుతున్నారు. ఈ సందర్భంలో వారి ప్రణయ మధురిమను రెడ్డిగారు వివరించారు,

ఇరువురు చందురంగ మాడు
దురు ఎంతో కతుబూని
ఎవరోడిన చివరికి బిగి
కవుగిలింత శిక్షయౌను. (పుట. 116)

ఇరువురు చిత్తరువులు వ్రా
తురు: ఏ రూపము తైనను
రచన పూర్తియైనంతనె
లకుమా ప్రభువుల బోలును. (పుట.117)

లకుమేతరమైన ఏ విషయమైనా రాజుకు దుర్భరంగా వున్నది. రాచకార్యాల వంక కన్నెత్తి చూడటం మాని వేసిన కుమారగిరి కాటయ వేమడి అభ్యర్థన ననుసరించి, ఒకరోజు ఆ స్థానానికి వచ్చాడు. ఇంతలో "లకుమ కాలు బెణికిం" దనే వార్త అక్కడికి వచ్చింది. కుమారగిరి తత్క్షణమే కొలువుకూటాన్ని వదలి ఆమె సన్నిధికి వెళ్ళి పసిపిల్లవాడిలాగా విలపించాడు. అతని ప్రవర్తనను చూచిన లకుమ విచలిత అయింది. ఆమె గుండె కరిగి పోయింది. ఆమె అతనితో—

వెన్నయైన గట్టిపడుట
యున్నది గాని స్వామీ!
మెత్తదనము దప్పనీదు
చిత్తము అన్య మెఱుంగదు. (పుట.136)

అన్నది. ఒక హృదయంలోని మార్దవాన్ని తెలియజేయటానికి నన్నయభట్టారకుడు 'నిండు మనంబు నవ్యనవనీత సమానము...' (భారతం, ఆది. 1-100) అన్నాడు. ఇక్కడ నారాయణరెడ్డిగారు 'ఆ వెన్న ఐనా గట్టి పడట మనేది ఉన్నదిగాని, స్వామీ! మీ హృదయానికి మాత్రం మృదుత్వం తప్ప కాఠిన్యం లేదు' అనిపించారు లకుమ చేత. 'నాకు మళ్ళీ జన్మ అనేది ఉన్నట్లయితే, మీ అర్ధాంగిగానే జన్మిస్తాను' అంటారు పతివ్రతలు. కాని, లకుమ ఆ విధంగా అనలేదు. అంతకుమించి—

నేను పునర్జన్మ మెత్తి
తేని ప్రభూ! రసికతా మ
హోదయమా మీ యువహృద
యముగా జన్మింతు గాక. (పుట.136)

అన్నది. సినారెగారిని జ్ఞానపీఠాన్ని అధిరోహింప జేయటానికి ఈ నాలుగు పంక్తులు చాలు!

రాణి లకుమ దగ్గరకు వెళ్ళింది. రాజును వదలి ఎక్కడికైనా వెళ్ళిపోవలసిందిగా ప్రార్థించింది. లకుమ గుండెలలో పిడుగు పడినట్లయింది. ఐనా, 'సరే' అని మాట యిచ్చింది రాణికి. కాని, తీర్చుకొనేదెట్లా? అందుకే—

ఎందుకీ హృదయమ్ము నిచ్చితి?
ఈశ్వరా! ఈ పాపిదానికి? (పుట.151)
అంటూ విలపించింది.

లకుమ గుండె రాయిచేసుకొని రాజు దగ్గరకు వెళ్ళింది. రాత్రి చీర ధరియించిన కాళిక ఆలవాలంగావున్న ఆమె అలంకరణను చూసి రాజు విస్తుపోయాడు. ఆమె దేహం ఝుంఝూనిలంలాగా ఊగింది. తలలో వున్న ఎఱ్ఱకలువలు మంటలను చూచినై, కండ్లు ఎఱ్ఱబడినై; శరీరం ఎఱ్ఱబడ్డది. నాట్యం చేస్తున్న లకుమ తన ఒడిలోనుండి పిడిబాకును లాగి రొమ్ములో పొడుచుకొని ఆత్మాహుతి చేసుకొన్నది. తన జీవనిధిని నేలగూల్చిన ఆ ఛురికకు చుట్టివున్న పత్రాన్ని చూశాడు రాజు. "వ్యష్టికన్నను దేశ సృష్టియు గరిష్ఠ" మనే ఆమె సందేశాన్ని చదివి, జాగృతుడయ్యాడు.

* * *

పాఠకలోకం ఏకవికీ, కావ్యానికీ అనాలోచితంగా అనర్ఘమైన సత్కీర్తిని కట్టబెట్టదు. సినారెగారికీ, వారి కర్పూర వసంతరాయలుకు ఏనాటికీ చెరగని, తరగని పేరు ఈనాడింతగా వున్నదంటే, దాని వెనుక రెడ్డిగారి అద్వితీయమైన ప్రతిభవున్నది: మహోన్నతమైన వ్యుత్పత్తి వున్నది; నిరంతరమైన కృషి వున్నది.

ఒక స్వర్ణకారుడు మడి బంగారాన్ని తీసుకొని ఎంతో శ్రమపడి ఆభరణాన్ని తయారుచేసినట్లుగా, నారాయణరెడ్డిగారు ఎక్కడో చాటువులలో నాను

(తరువాయి 12వ పేజీలో)

# మొల్ల రామాయణంలో సాంసారిక చిత్రాలు

—డా॥ విజయలక్ష్మి, ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

వెయ్యేళ్ళ చరిత్రవున్న ఆంధ్ర వాఙ్మయంలో కవయిత్రులు కొందరే. వారిలో రామాయణం వ్రాసిన మొదటి కవయిత్రి మొల్ల. ఈమె శ్రీనాథుణ్ణి, అంతకుముందున్న కవుల్ని కీర్తించడంవల్ల శ్రీనాథుని తరువాతి కవయిత్రి అవడంలో అభిప్రాయ భేదం లేదు.

మొల్ల వ్రాసిన ఏకైక కావ్యం రామాయణం. ఒక స్త్రీ దృక్పథంలో రామాయణ కథ ఏలాగుందో తెలుసుకోవడానికి మొల్ల రామాయణ మెంతో ఉపకరిస్తుంది. మొల్ల రామాయణంలో అనేక వర్ణనలున్నా ఆ కవయిత్రి వర్ణనల్లో 'సాంసారిక చిత్రాలు' సామాన్య జనానికి అందుబాటులో వున్నాయనడంలో సందేహం లేదు.

కుటుంబమన్నది కావ్యస్వరూపాన్ని తెలియజేస్తే సంసారమన్నది అంతస్సారాన్ని తెలియజేస్తుంది. ప్రాచీనులు కవి పడే విరక్తిని, మోక్షాన్ని గొప్ప చెప్పినా, 'సంసారాన్ని' కూడా గొప్పగా అభిమానించారు. 'సంసారం' అనే మాటకు తమిళంలో 'భార్య' అనే రూఢి. భార్యాభర్తలకు సంబంధించిన చిత్రాలు మొల్ల రామాయణంలో పరిశీలించడం ఈ వ్యాస ప్రధానాంశం.

ఈ సాంసారిక చిత్రాలు మొల్లరామాయణంలో మూడు రకాలుగా వున్నాయి. అవతారికా భాగంలోని సాంసారిక చిత్రాలు, వర్ణనలో సాంసారిక చిత్రాలు మూడవది ప్రధాన కథల్లోని సాంసారిక చిత్రాలు.

## అవతారికాభాగంలో సాంసారిక చిత్రాలు :

తెలుగులో కవిగాని, కవయిత్రిగాని ప్రధాన కథ వ్రాయడానికి ముందు చేసే స్తుతిపద్యాలు, కావ్యరచనా హేతువు మొదలయిన విశేషాలున్న భాగం అవతారిక. మొల్ల ఈ అవతారికల్లో సరస్వతిని, పార్వతిని స్తుతించింది.

లోకంలో కట్టుకొన్న భర్త దిగులు కల్లనయితే నేం, వినోదంలోను ఉంటే నేం భార్యకి కోప్పడేట సహజమే. కొన్ని సందర్భాలలో మనకు ఇటువంటి దృశ్యం పట్టడం అంత్యం కావచ్చు. అప్పుడా యిల్లాలు అలగడం సహజం. గడపదగ్గర నిలబడి ఒళ్ళంతా కళ్ళుచేసుకొని ఎదురుచూస్తూ వుండవచ్చు. ఈలోగా కట్టుకున్నవాడు కనబడితే ఆమె కళ్ళల్లో వేయి జ్యోతులు వెలుగుతాయి. ఈ దృశ్యాన్ని సరస్వతీ చతుర్ముఖులకు అన్వయించి మొల్ల వ్రాసిన ఈ క్రింది పద్యం హృద్యం.

"చెలిమి మించుకొండ నుత
మింతగ జాలిన యంచ నెక్కి నా
ప్పాళి నటించి వచ్చు చతు
రాస్యు నెదుర్కొని నవ్వు దేరగా
వాలిక సోగ కన్నుల ని
వాళి యొనర్చు ముదంబుగూర్చు
విద్యాలయవాణి"
(అవ. 8వ ప.)

ఒక తల్లికి యిద్దరు మగపిల్లలు. ఒకడేమో చూడ్డానికి అందంగా లేడు. రెండవవాడేమో ముద్దుల మూటగట్టే బిడ్డ. ఆకారాలు వేరయినా అమ్మకు ఇద్దరూ సమానమే. తల్లి కూచొనివుంటే పిల్లలు ఆడుకున్నారు. ఈలోగా మా అమ్మ అన్నాడు ఒకడు. కాదు మా అమ్మ అన్నాడు మరొకడు. ఇద్దరు అమ్మ చెరో వైపు నిలబడ్డారు. వారు ఆకారంలో ఎత్తులో మరీ పెద్దవారు కాకపోవడం వల్ల వక్షోజాలదాకా వచ్చారు. వాళ్ళ తలలు వక్షోజాలకు తగులుతూ వున్నాయి. తల్లి చెరో చేతులతో వారిని పట్టుకొనే వుంది. అమ్మ దగ్గరికి చేరగానే మళ్ళీ ఆ పిల్లలు ఆటల్లో పడ్డారు. తమ తల్ని వక్షోజాలతో రాయడం మొదలెట్టారు. ఈలోగా ఇద్దరు కళ్లు పైకెత్తి చూచారు. తలమీద చంద్రవంక కనబడింది. ఆ చంద్రవంక కోసం ఇద్దరూ ఎగబడ్డారు,

---

(11వ పేజీ తరువాయి)

మాత్రంగాన్నున్న. అతనికి సంబంధించిన శ్లోకాన్ని తీసుకొని, దానిని భావనచేసి, చేసి, ఈ రసరమ్య గీతికావ్యాభరణాన్ని సృష్టించారు. అది ఆధునికాంధ్ర సాహిత్య భారతి గళసీమలో దివ్యకాంతులతో ప్రకాశిస్తున్నది.

సి. నారాయణ రెడ్డిగారు కర్పూర వసంతరాయలు తర్వాత అనేక రచనలు చేశారు. అనేక పురస్కారాలను పొందారు. భవిష్యత్తులో ఇంకా మంచి రచనలు చేస్తారు. ఇంకా గొప్ప పురస్కారాలను పొందుతారు. ఎప్పటికీ ఆయన ఆ నాటికీ, ఈ నాటికీ, ఏ నాటికీ కర్పూర వసంతరాయలకవే!।

* * *

పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి,
10-5-16, అరండల్ పేట,
నరసరావుపేట-522 601
గుంటూరు జిల్లా

0—0

పిల్లల కొట్లాటలు, తనమీద వాలిఉన్న అనురక్తి అన్నీ చూసిన అమ్మ నిండుగా తనలో తాను నవ్వుకొంది. అచ్చం ఈలాంటి దృశ్యాన్నే మొల్ల పార్వతి వర్ణనల్లో చేసింది.

చ॥ "కరి ముఖుడుం గుమారుడు వి
కారపు లీల ముద్దు మాపుచు
స్తనములు వాడుచున్వరిగ
గుట్టలు దాటుచు ఇమ్ము దోయిలో
శిరములు రాయుచుం గబరి
జేర్చిన చంద్రుని బట్టి తీయూ
రగముల జారు నవ్వెడు
జగముల తల్లి శుభంబులీవుతన్"

వినాయకుడు, కుమారస్వామి చేతలకు నవ్వుకొనే పార్వతి చిత్రణ ఈ పద్యంలో వుంది. ఈ పిల్లల చేష్టలు సంసారంలో కనిపించే సహజ సుందర దృశ్యాల్లో ఒకటి.

వర్ణనల్లో 'సాంసారిక చిత్రాలు' ఈ వర్ణనలు ప్రధానంగా కథల మధ్య వస్తాయి. ఇవి చాలవరకు ప్రకృతివర్ణనలే. వాటిలో 'చకోరదంపతుల విహారం' చెప్పుకోదగ్గది.

పెళ్ళయిన కొత్తలో, వయసులో దంపతుల విహారానికి వేళాపాళా అంటూ లేకపోవడం నాటికీ నేటికీ సమానమే. వెన్నెలవేళ దంపతులు తిరుగుతున్నారు. మగవానిలో దర్పం, ఆడదానిలో వినయం రెండూ రంగరించి వున్నాయి. మత్తాబయిన ముగను చూసేసరికి మగవానికి తన ఇల్లాలిపై ఎక్కడలేని మోజు 'ఆప్యాయత' ముంచుకు వచ్చింది. తన ప్రేయసికి కోరుకునే వస్తువును అందించి తానూ మురిసిపోయాడు. ఈ చిత్రాన్నే చకోరదంపతుల వర్ణనలో మొల్ల సందర్శించింది.

ఉ॥ "వెన్నెల తీగలన్ గొనలు
లేదుక ముక్కుల ద్రుంచి తెచ్చి దా
రొక్కన్న ప్రసూనగణాతతికి
గూరిమి నోరనిచ్చి కేళికిన్
సన్నపు గుంత పాకముల
సన్నలు సేసి ముద్దించు నింపుగన్
దిన్నని చంద్రకాంత మణి
తిన్నెలమీద చకోరదంపతుల్"
(అయో. 19)

మగచకోరం ఆడచకోరానికి వెన్నెల తీగల్ని ముక్కులతో త్రుంచి తెచ్చి యిచ్చి అవ్యక్తమధురభాషణం సాగించడం పై వర్ణనలోని విషయం.

మూడవది రామాయణ కథలోని సాంసారిక చిత్రాలు.

లోకంలో అక్కడక్కడ అమాయకు లయిన భర్తలుండడం, వారికి గయ్యాళి భార్యలుండడం తెలిసిందే. అలాంటివారి యిళ్ళల్లో మగవాని నోరుకట్టి 'హుకుం' జారీచేసే విధానం ఇల్లాండ్రదే. ఆ సమయాల్లో మగవాడు దిక్కుతెలియక చేయడమో, తనకేమీ పట్టనట్లుండడం తెలిసిందే, ఈ విశేషాల్ని దశరథ, కైకల వర్ణనలో మొల్ల స్పష్టం చేసింది.

రామునికి పట్టాభిషేక సన్నాహాలు జరుగుతున్న వేళల్లో కైక తన కిచ్చిన వరాలు చెల్లించమని నిలదీసి అడిగింది. దశరథుడు "అడకత్తెరలో పోకచెక్క" అయినాడు. సమయం గడిచిపోతూ వుంది. ఈలోగా సుమంత్రుడు సుముహూర్త మాసన్నమయిందంటూ గుర్తు చేయడానికి రానే వచ్చాడు. అప్పుడు దశరథుడు 'ఉల్లంబు గలంగ మసుంగిది యుచ్చెడియు పలుకులకు మాటాడనోడి యున్నక' వున్నాడట. ఈ చేష్టలన్నీ చూస్తున్న కైక గడచిపోయిన కథల్ని ఏకరువు పెట్టి

"ననపీమున్ మునివృత్తిమండు మనుడీ
వైకంబ యా రాముడిన్"
(అయో. 28)

అని పొమ్మనలేక పొగపెట్టి విధాన మనుసరించింది.

ఆడపిల్లలు అయినవారితో తిరగడం తప్పనిపించుకోదు గాని అపరిచితులతో తిరగడం నాటికీ నేటికీ తప్పే. అలాంటి వారిని 'అదోరకంగా' చూడడం సమాజంలోని వింత. ఈ భావాన్ని మొల్ల సీతమ్మ మాటల్లో స్పష్టం చేసింది.

పొద్దు పొడవడానికి ముందే సముద్రం దాటిస్తానని హనుమంతుడు సీతమ్మకు భరోసా ఇచ్చాడు. ఆంజనేయుని మాట అకు అవును కాదనడం తేలికయినా సీతమ్మ

"నీ వంత వాడ వగుదువు
నీ వెంటనె వత్తు నేని నెగడవు కీర్తుల్"
(సుం. 119)

అదీగాక రామచంద్రుని తప్ప మరెవ్వరిని అంటుకోలేదని (సుం.120) చెప్పింది. పైగా హనుమంతుడు నొచ్చుకొంటా డేమోనని 'నీవు రామునికి భృత్యుడివి, పుత్రసమానుడివి. అంచేత నీ వెంట నరుగు దెంచుట తప్పు గాకపోయినను ఒక తిర్చుకవచ్చు టుచితంబుగాదు' (సుం. 120) అని సున్నితంగా చెప్పింది.

మగవానిమీద తనకెంత మక్కువ వున్నా తన అభిమానానికి అడ్డు తగిలి నప్పుడు భార్య నోరు విప్పడం లోకంలో కనిపించే సాంసారిక దృశ్యం. మొల్ల ఈ విషయాన్ని నేపథ్యంగా పెట్టుకొని మండోదరి రావణుల సంభాషణం తీర్చింది.

అంగదుడు మండోదరి జుట్టుపట్టుకొని లాక్కొంటూ వచ్చి రావణుని ముందు నిలబెట్టాడు. అంతవరకు అణచుకొన్న ఆగ్రహం కట్టలు త్రెంచుకుంది. "రాముడు దేవుడని, వానరులు దేవతలని బొద్దస్త

(తరువాయి 14వ పేజీలో)

# భారతీయ విజ్ఞాన వైభవం

— ఆచార్య భావన్

విజయనగరం, గురజాడ స్మారక జిల్లా కేంద్ర గ్రంథాలయంలో స్థానిక సాహితీ మిత్ర సమాఖ్య విజయభావన 31-8-1991 శనివారంనాడు 99వ సభ - ప్రసంగ తరంగిణి కార్యక్రమాన్ని ఏర్పాటుచేసింది.

విజయనగరం జిల్లా శ్రీరాంనగర్‌కు చెందిన ఎస్. డి. ఎస్. కళాశాలలో కెమిస్ట్రీ లెక్చరర్‌గా పనిచేస్తున్న శ్రీ ఆర్. సత్యనారాయణమూర్తి ప్రధానవక్తగాపాల్గొని 'భారతీయ విజ్ఞానవైభవం' అనే విషయంపై సాధికారికంగా ప్రసంగించారు.

18వ పేజీ తరువాయి

మౌనం తనగట్టుకొని చెప్పినా విన్నావు కాదు-

"రాముని దూతలం నన్నును
కాముల పెట్టంగ జాడ బందువై నీతన్
నా మౌనము గాపాడని
నీ మానువ మేటి కిపుడు నిర్జరవైరీ"
(యుద్ధ. 3-14)

అని 'చెడామడా' వాయించడంతో రావణు డప్పుడే 'మహోగ్రాకారుండై లేచి' యుద్ధభూమికి బయలుదేరాడట.

ఆతుకూరి మొల్ల అవివాహితో లేదా విధవతో తెలియదు గాని కవయిత్రిగా పరిశీలించినపుడు మాత్రం లోకజ్ఞురాలన డంలో సందేహం లేదు.

* * *

డా॥ ఏ. జయవల్లి,
లెక్చరర్,
శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం,
తిరుపతి-517 502.

.........

ఏ విషయాన్ని అర్థంచేసుకోవాలన్నా తర్కశాస్త్ర పరిజ్ఞానం చాలా అవసరమని చెపుతూ, ప్రతివిషయాన్నీ ప్రయోగాత్మకంగా ఋజువుచేయటం అసాధ్యమనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. భారతీయమైన విజ్ఞానశాస్త్ర సంపద అమూల్యమైనదని ఆయన అన్నారు. అపౌరుషేయాలైన వేదాలలో విజ్ఞానశాస్త్రానికి సంబంధించిన ఎన్నో విషయాలు నిక్షిప్తంచేయబడి వున్నాయని ఆయన పేర్కొన్నారు. స్వయంగా దర్శించి తెలుసుకోవాలితప్ప అన్నింటినీ వర్ణించలేమని చెపుతూ మన మహర్షులు తమతపోశక్తితో దర్శించి మన కందించిన విజ్ఞానశాస్త్ర విషయాలు మనకు శిరోధార్యమైనవని ఆయన అభిప్రాయపడ్డారు. సృష్టిపుట్టుక గురించి ఋగ్వేదంలోను, విశ్వం పుట్టుక గురించి తైత్తిరీయ ఉపనిషత్తులోను వున్నదని ఆయన సోదాహరణంగా వివరించారు. సూర్యుని గురించి అరుణంలోను, ఆదిత్య హృదయంలోను వివరంగావుందని ఆయన చెపుతూ, భూమి సూర్యుని చుట్టివచ్చే దీర్ఘవృత్తాన్ని వేదంలో 'త్రినాభి' అంటారని తెలియజేసారు. మేఘాలను తయారుచేసేది, తయారయిన మేఘాలనుగాలి ద్వారా భూమండలంపై వర్షింపచేసేది సూర్యుడేననీ ఆయన స్పష్టంచేసారు. ప్రాణశక్తికి ఆధారభూతుడైన సూర్యుడు మనకు ఆరాధ్యుడని ఆయన చెప్పారు. పూర్వం కాలెండర్ మార్చి నెలనుంచి ప్రారంభమయ్యేదనీ, అలాచూస్తే సెప్టెంబరు ఏడవనెల అవుతుందనీ, సెప్టెంబరు 'సప్త' సంఖ్యని ఆధారంగా చేసుకొని ఏర్పరిచిందనీ; అలాగే అక్టోబరు, నవంబరు, డిశంబరు కూడా అష్టమ, నవమ, దశమ పదాలను ఆధారంగా చేసుకొని ఏర్పరిచారని ఆయన వివరించారు. మన కాలమానంలో చెప్పబడిన 'హోర' అనే దాన్ని పాశ్చాత్యులు (Hour) 'అవర్'గా మార్చారని ఆయన పేర్కొన్నారు. వృత్తానికి 360 డిగ్రీలన్నది ఋగ్వేదం ఆధారంచేసుకొని చెప్పబడిందని ఆయన తెలిపారు. భారతీయ విజ్ఞానశాస్త్రంలో కార్యకారణ సంబంధం ప్రత్యేకంగా పేర్కొదగిన విషయమని చెపుతూ శ్రీ సత్యనారాయణమూర్తి తన ప్రసంగాన్ని ముగించారు.

విజయనగరానికి చెందిన రిటైర్డు హెడ్మాస్టర్ మరియు ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ సంఘాధ్యక్షులు అయిన శ్రీ యు. ఎ. నరసింహం సభకు అధ్యక్షత వహించారు. భారతీయ సంప్రదాయ విశేషాలను ఆయన తెలియజేసారు. గణిత, ఖగోళ శాస్త్రాలలో మనదేశం ఎంతో ప్రగతిని సాధించిందని ఆయన వివరించారు. భారతీయ విజ్ఞానశాస్త్ర విషయాలను విద్యార్థులకు సరళమైన శైలిలో బోధించి, మన దేశ ఔన్నత్యాన్ని చాటి చెప్పవలసిన అవసరం ఎంతైనావుందని శ్రీ నరసింహం అభిప్రాయపడ్డారు.

విజయనగరానికి చెందిన ప్రభుత్వ మహారాజాసంస్కృత కళాశాలలో ఋగ్వేదపండితులైన శ్రీ యనమండ్రసూర్యనారాయణ అవధాని శర్యవేక్షణలో 'వేదభారతి' కార్యక్రమం కూడా ఈ సభలో జరిగింది. వేదవిద్యార్థులు యనమండ్ర వెంకటరామ సత్యనారాయణశర్మ; మొదటాటి సత్యనారాయణశర్మ; కప్పగంతుల ప్రసాద్‌శర్మ; ఘండికోట మణిశాస్త్రి వేదపఠనంగావించి, శ్రోతలను ఆనందంపచేసారు.

విజయనగరం - చెవిటి పిల్లలపాఠశాలలో 6వతరగతి చదువుతున్న వి. వీరాచారికి ఖమ్మంజిల్లా పాల్వంచకు చెందిన రిటైర్డు ఎలక్ట్రికల్ అసిస్టెంట్ ఇంజనీర్ శ్రీ పి. వీరాచారి సౌజన్యంతో రు116/-

(తరువాయి 15వ పేజీలో)

# జాషువా 'స్వయంవరం'లో స్వతంత్ర భారతం

—డా॥ గుమ్మా సాంబశివరావు, ఎం.ఏ. పిహెచ్.డి.,

ఆధునికాంధ్ర సాహితీవనంలో తన దైన గొంతు వినిపించిన కవికోకిల గుర్రం జాషువా కలం కలంనుంచి వెలువడ్డ లఘు కావ్యం 'స్వయంవరం'. సమకాలీన సమాజంలోని పరిస్థితులకు ప్రతిస్పందించి, ప్రతిభావంతులైన జాషువా అద్భుత కవితాసృష్టి గావించారు. కులమతాలతో పళ్ళి కంపుగొడుతున్న సమాజాన్ని అసహ్యించుకొన్నారు. సమతా మమతామయమైన సమాజం కావాలని, రావాలని ఆశించారు. జాషువా రచనలన్నీ సామాజిక స్పృహతో వెలువడినవే. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన సందర్భంలో స్వరాజ్యబాలిక తనకు తోడు కలిగిన వరునికోసం సాగించిన అన్వేషణమే ఈ 'స్వయంవరం'. అనాడు సమాజంలో దర్శనమిస్తున్న సంఘటనలన్నిటినీ 'స్వయంవరం'లో ప్రతిబింబింపచేశారు. వీరి 'స్వయంవరం' కావ్యంలో చిత్రించబడిన పరిస్థితుల్ని సమీక్షించడమే ఈ వ్యాసం ప్రధానోద్దేశం.

'స్వయంవరం' బాల్యము, స్వయంవరము, దేశాటనము, హిమగిరియాత్ర అనే ప్రకరణాల్లో సాగింది.

బాల్యం :

కులమత భేదాలులేని సత్యవాక్య పరిపాలక డొకడు భారతమాతకు పుట్టాడు. అతడనేక కష్టాలుపడి స్వతంత్రతా శిశువును పొందాడు. వర్గకలహాలు మాని ప్రజలంతా ఆ శిశువుకు ఉత్సవాలు జరిపారు. ఆ చిన్నదానిని 'స్వరాజ్యం' అని పిలిచారు. ఆ పెంపు ఏడు నెలలు నిండకముందే ఆ మానుసివాణ్ణి పొట్టన పెట్టుకుంది. ఇక్కడ ఆ మానుసివాడు గాంధీమహాత్ముడన్న విషయం అందరికీ తెలిసిందే. మతం మత్తులో ఆ మానుసివాడు అహుతి కావలసి వచ్చింది. ఎక్కడ చూచినా అయన విగ్రహాలు వెలిశాయి. తాత మరణానికి ఆ బాలిక విలపిస్తుంటే అయన బొమ్మల్ని చూపి ప్రజలు ఓదార్చారు.

కొంతకాలానికి కలం మరకల్యాలు పుంజుకొన్నాయి. స్వరాజ్య బాలిక విద్యాభ్యాసం కావించింది. బడిలో చదువుతున్న నీతిపాఠాలకు, లోకంలో తటస్థపడుతున్న దుందుడుకు చర్యలకు పొత్తు కుదరకపోవడంతో ఆమె దిక్కులేని సంతాపాన్ని పొందింది. ఆమె గాంధీ ధర్మసూత్రాలను చదివి చెలికత్తెలకు నేర్పడం ప్రారంభించింది. ప్రకృతినుంచి అనేక పాఠాలు నేర్చుకొన్నది. బాల్య చాపల్యం తొలగిపోగా ఆమెకు యవ్వన మంకురించింది. ఆమె రూపసంపద స్పష్టంగా గోచరిస్తున్నది.

స్వయంవరం :

స్వరాజ్య బాలికకు స్వయంవరం ప్రకటించబడింది. జాతి పట్టింపు లేకుండా గుణాభిరాముడైనవాడే ఆ కన్యను వరించడానికి అర్హుడౌతాడు, దొరలు దొంగలు అంతా ఆ స్వయంవరానికి వచ్చారు. వారందరినీ చూసి ఆమె అసహ్యించుకొన్నది. ఆ సమయంలో ఆమె కన్నుల ముందు గాంధీ మెఱుపులాగా దర్శనమిచ్చాడు. స్వయంవర మంటపంలో స్వరాజ్యకన్య, తనను వివాహమాడడానికి వచ్చిన రాజకుమారులకు చూపుల కాన్కల నందజేసిన తీరును జాషువా మనోహరంగా వర్ణించారు.

"కొలిమిసుంగు కూరంట్లువడి మిస్తటపుం
దమకంబులోడ, భూ
పాలకమారవల్ బలుపు కాడి విలోకన
శూల సంక్తికిన్
బాలిక మారుచూపుల సుపాయన మిచ్చె,
ఒకొంగు లెప్పడుక్
మేలసు స్వీకరించి విరమించరు
ప్రత్యుపకారమగ్రధీ

(14వ పేజీ తరువాయి)

పగడుబహుమతిని సభాధ్యక్షులు శ్రీయుత ఎ. నరసింహం ప్రదానం చేసారు.

విజయనగరానికి చెందిన రిటైర్డు రైల్వే గార్డు శ్రీ పి. విశ్వేశ్వరరావు ముఖ్య అతిథిగా పాల్గొని అభినందన ప్రసంగం చేసారు. ప్రధానవక్త శ్రీ ఆర్. సత్యనారాయణమూర్తిని ఆయన శాలువా, పూలమాల, మెమెంటోలతో ఘనంగా సన్మానించారు. 'వేదభారతి'లో పాల్గొన్న ఋగ్వేదపండితుని, విద్యార్థులను పండ్లు తాంబూలాలు, దక్షిణలతో శ్రీవిశేశ్వరరావు సత్కరించారు.

శ్రీ పి. వి. శేషుబాబు ప్రార్థనతో ప్రారంభమైన ఈసభకు ప్రధాన కార్యదర్శి డా॥ ఎ. గోపాలరావు స్వాగతం చెప్పి, అతిథులను పరిచయం చేసారు. కార్యదర్శి శ్రీ కె. మార్కండేయులు కందేళపఠనంగావించి, వందన సమర్పణ చేసారు.

* * *

ఆచార్య భవన్
దాసన్న పేట
విజయనగరం-531202

(*.*)

అర్థాంతరన్యాసంలో సాధించబడిన ఈ వర్ణన సహృదయరంజకమై అలరారుతున్నదనడంలో సందేహం లేదు.

స్వరాజ్య కన్యక స్తోత్ర పాఠాలు జరుగుతున్న సమయంలో కపటనాటకాలాడే అవినీతిమంతులంతా గుమ్మడికాయల దొంగల్లాగా తలలు వంచుకొన్నారు. ఆ సమయంలో అహింస అనే చెలికత్తె స్వయంవరానికి విచ్చేసిన వరుల చరిత్రల్ని వివరించింది. ఎలాంటి వారు పెండ్లికొడుకులుగా వచ్చారో సీసపద్యంలో మనోహరంగా చెలికత్తె పలుకులద్వారా వర్ణించారు జాషువా.

సీ॥ శాసనసభలలో సభ్యత్వ పదవికై
 వింత సంస్థలను స్థాపించువారు
కాలానుసరణంబుగా తొండలను బోలి
 మాటిమాటికి రంగు మార్చువారు
యుద్యోగమూడగా యుక్క-
 రోషమూతోడ
 పట్టింటిలో చిచ్చు పెట్టువారు
నిమ్నజాతులమీద నిప్పులు చెరగుచు
 విధిలేక కన్నీరు విడచువారు
చిరుత విధవల కన్నీటి వరదలందు
 హాయిగా ముసాళ్ళ పెండ్లి
 చేయువారు
వచ్చియున్నారు నీ స్వయంవర జిగీష
విడియములు మాని మది పెండ్లికొడుకు
 లనుచు. (పుట 14)

లోకంలో ఎలాంటి మనస్తత్వాలు కలవారున్నారో, ఈ పద్యంలో చక్కగా వర్ణించారు.ఇంకా కాటికికాళ్లుచాచిన ముసలివాళ్ళు 'పెళ్ళి' అనగానే పరుగులు తీసుకొంటూ వచ్చారని వివరించారు. ఐశ్వర్యవంతుడు, దేవునిపై వ్యాపారం చేసేవాడు, తనవారికోసం పాటుపడేవాడు, పెక్కు సంసారాలు కూల్చినవాడు; హిందూమత మద్యపాయి, పూజారి, నిర్దయుడు, బుట్టమీసాలవాడు, స్త్రీవిద్యావ్యతిరేకి, తత్వజ్ఞుడు, పీఠాధిపతి, హరిదాసుడు, విషస్వభావులు, పయోముఖ విషకుంభాల్లాంటివారు, కులాలను సమర్థించేవారు_ రకరకాల వ్యక్తులు స్వయంవరానికి వచ్చినట్లు చెలికత్తె వివరించింది. లోకంలోఉన్న భిన్నమనస్తత్వాలు కలిగినవారంతా వచ్చినట్లు పై విషయాన్ని బట్టి గ్రహించవచ్చు. వీరిలో ఎవరూ కన్యకు నచ్చలేదు. ఆమె కన్నులు అశ్రుపూరితాలయ్యాయి. శాంతిదూతలు, దేశభక్తులు కూడా ఉన్నారు. వచ్చినవానిని వరించుమని చెలికత్తె చెప్పిన మాటల్ని కన్య లక్ష్యపెట్టలేదు. నిట్టూర్పులు విడిచింది. పుష్పహారాన్ని వివాహ మంటపంలో విసిరి వరుల చిత్తాలు కలత చెందగా, గజ్జెలు మోగుతుండగా నిరాశతో, దుఃఖంతో వెళ్ళిపోయింది. వరులంతా ఆమె లావణ్యాన్ని పరిహసించారు. తమను గాదని ఆ గాంధి మనుమరాలు ఎలా కాపురం వెలిగిస్తుందో చూస్తామని బయటకు వచ్చేశారు. ఇక్కడ స్వార్థం కోసం స్వరాజ్యాన్ని నాశనం చెయ్యడానికి కూడా వెనుకాడనివారి మనస్తత్వాలు వెల్లడి చెయ్యబడ్డాయి.

దేశాటనము :

మంచి గుణాలు కలిగినవాడే ఆమెకు భర్తగా ఉండాలని గాంధీ తన వీలునామాలో వ్రాశాడట. అలాంటి వరుని కోసం ఆమె దేశమంతా తిరిగింది. పాదాలు కందేలాగా అనేక భూముల్లో సంచరించింది. అనేకమైన దివ్యస్థలాలు దర్శించింది. రామ[illegible]లు చేబట్టుక పోతూ ఎక్కని కొండ ఎక్కింది. దేశాన్ని చిక్కులపాలు చేస్తున్న రాష్ట్రీయులను చూసి దుఃఖం పంచుకొన్నది. భారత జాతీయ వైభవాన్ని తలచుకొని గర్వ సంభరితమైంది. భేదభావాలుండకూడదని ప్రజలకు బోధించింది. జనులంతా ఆమెకు జయజయనాదాలు పలికారు. నైజాం ప్రజలకు గూండాల భయం తొలగిపోవడం గమనించి సంతోషించింది. నైజాం నవాబు ఇచ్చిన విందును స్వీకరించింది. తెలుగు కవుల దారిద్ర్యాన్ని గమనించి వాళ్ళ అండ నిలుస్తానని అభయమిచ్చింది.

కొన్ని ప్రాంతాల్లో స్వరాజ్యలక్ష్మిని చూసి ప్రజలు సంతోషించలేదు. రకరకాలప్రశ్నలువేశారు.ప్రజలు 'దొరలుపోయారు దొంగలు మిగిలారు' అని ఆనాటి దేశస్థితిని తెలిపారు. బ్రిటీషువారి పాలనమే బాగున్నదన్న అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు. శ్రమజీవులు ఆమెలో ఆరాటాన్ని గోళాను ప్రవేశింపజేశారు. ప్రజలహృదయాల్లో ఉన్న అశాంతిని ఆవేదనల్ని తెలిపారు. దైవాలు కూడా తమబ్రతుకులు సంశయగ్రస్తమయ్యాయని తెల్పారు. ఉత్సవవిగ్రహాలమై జీవిస్తున్నామని పలికారు. ఆమె దేశభక్తుల కన్నీటిలో తేలిపోయింది.

గాంధీకాలంలో ఉన్న సామరస్యం తొలగి పోయిందని అశ్రుపూరిత అయింది. హరిజనులసమస్య తీర్పరానిదై, దుస్సహమై ఆమెను తోచింది. సకలసంపదలకు నిలయమై ప్రఖ్యాతి పొందిన భారతదేశమంతా దారిద్ర్యంలో మునిగిపోవడాన్ని చూసి సహించలేకపోయింది. మగడు మరణించగా శిరోజాలు తొలగించబడిన కన్యస్థితిని గమనించి బాధపడింది, పూజారులనీతి విహీనతను కన్నులారగమనించింది. కులాలకుమ్ములాటలకు సిద్ధమైన మూర్ఖుల్ని చూసి చింతించింది. మరొకచోట మధుర స్వభావాలతో, భేదాలు లేకుండా ఆటలాడుకొనే బాలల్ని చూసి నవ్వుకొన్నది. పూజనెపంతో హింసపాలగడాన్ని చూసిబాధపడింది.స్వార్థం పెరిగిపోయి[illegible] నాట్యం చేస్తుండగా గాంధీవిగ్రహం

కంట తడిపెట్టిందట. దాన్ని గమనించి ఆమె చిత్తం క్రుంగిపోయింది. స్త్రీలు విద్యావంతులు కాకపోవడాన్ని గమనించిన ఆమె మతిపోయింది. సమాజంలో ఆనాడు నెలకొని ఉన్న సర్వ అనర్థాలను ఉన్నవి ఉన్నట్లు వర్ణించారు జాషువా. పైవిషయాలను గమనిస్తే సమాజం యొక్క స్థితి ఎంత అస్తవ్యస్తంగా ఉన్నదో, సంస్కరించడానికి సాధ్యం కాకుండా ఉన్నదో వ్యక్తమౌతున్నది.

**హిమగిరి యాత్ర ;**

స్వరాజ్య కన్య వారణాసికి వెళ్ళి, శివుని ఆరాధించి, గంగలో మునిగి, అడవులు దాటి హిమగిరి ప్రక్కనే ఉన్న ఒకరమ్యమైన వనప్రదేశానికి వెళ్లింది. అక్కడ జంతువులు చెలిమితో తిరగడాన్ని గమనించి మనుషులకంటే జంతువులే నయమని భావించింది. చిలుకలు ఎలా తమ సానుభూతిని తెలిపాయో మనోహరంగా వర్ణించారు.

'తీయని పండులం గుడిచి దీర్ఘ
మహీరుహావిస్తృతచ్ఛత
చ్ఛాయల విశ్రమించి, శుక జాతియా
చ్ఛాయల విశ్రమించి, శుకజాతమి
మ్మచ్చటలాడుచుండి; స్వే
చ్ఛాయుత రాజ కన్య కగచాటులు
వచ్చెనటంచు. రామ రామ
మా! యను పల్కులం దెలిపె
సాదరణాంచిత సానుభూతులన్'-

ఉత్ప్రేక్షతో కూడిన ఈపద్యం జాషువా ప్రతిభకు దర్పణమనడంలో అతిశయోక్తి లేదు. తగిన వరుడు తనకు లభించకపోవడాన్ని గమనించి' భర్త లేకుండా మనుగడ సాగించలేదు కదా-చక్రవర్తి యింటిలో పుట్టినప్పటికీ ఆమెకు భర్త కావాలి కదా!' అనుకొన్నది. భవిష్యత్తులో తనకు ప్రమాదం కలుగబోతున్నదని బాధపడింది. అప్పుడు చెలికత్తె "పెడ్లికొడుకు శోకం మంచిదిగాదని ఆమెకు తగినవరుడు ఎక్కడో ఒకచోట ఉండకపోడని పలికింది. వాణ్ణివరించి నీవు చక్కగా కాపురం చెయ్యాలి అని పలికింది. అనందలక్ష్మి నీకు ప్రాప్తించుగాక. కాంతిని నెలకొల్పి శాశ్వతసన్నుతి పొందవమ్మా అని తెలిపింది. ప్రకృతిద్వారా ధర్మసందేశాన్ని గమనించుమని పలికింది. సీసపద్యంలో వివరించబడిన ఈవిషయాలు జాషువాభావుకతకు ప్రత్యక్ష సాక్ష్యాలు.

సీ. 'అగుపించె శిఖరాలు దిగివచ్చు
సెలయేటి
తరగలో నడయాడు దాసదీప్తి
కనుపట్టె స్వాతి మేఘాల గర్భమునందు
తిత్తభూశిలను నోదార్చు చలువ
దీపించె ప్రతిచిన్నితీవ సుందరి యందు
సాలింగన ప్రణయాను రక్తి
తోచె ప్రభాత వాతూల బాలకులందు
మట్టిమూపులు దట్టిపోవు మైత్రి
త్యాగులైనవారి ధర్మసందేశంబు
లాచరించు ప్రకృతి నభినుతించి
ఆస్వరాజ్య కన్య యాత్మలోగల చింత
లెల్ల మరచె మేను పల్లవింప'(పుట47)

ప్రకృతి సందేశాన్ని గమనించిన స్వరాజ్యకన్య చింతలకు దూరమై సుఖము పొందను చేరుకొన్నది. గాంధీజీ ప్రజలను సన్మార్గాన్ని సంధానించడానికి రాట్నంపై దారాలను నేటికీ గాయాలు పడ్డ శరీరంతో తీస్తున్నాడని పలికింది. వెంటనే స్వరాజ్య కన్య కన్నులకు మహాత్ముని మూర్తి కనిపించింది. తాతవచ్చాడనే సంతోషంతో మాన్యాన్ని కాగిలించుకొన్నది. తాత వెళ్ళిన దిక్కుగా పయనించి చివరకు రాజఘాట్ చేరింది. శిలగా ఉన్న తాతకు మొక్కి తాతపోలికలున్న వ్యక్తి తనకు వరుడుకాని అతని శోకం తీరింది. హృదయమున్న వానిని, ఈడు జోడైన వానిని పెండ్లాడింది. అమెరికా ఇంగ్లాండులు మెచ్చుకొన్నాయి. చీనాజపాన్ మొదలైన దేశాలు కానుకలు పంపాయి. కీడుమేలన కుండా పాకిస్తాన్ శుభాకాంక్షలంపింది.

వాతావరణం మారిపోయింది. కళలు, సిరులు అభివృద్ధి చెందాయి. బంగారు పంటలు పండాయి. విద్యాభివృద్ధి జరిగింది. తాను స్వయంగా చూసి వచ్చిన అశాంతిని స్వరాజ్యం చక్కదిద్దింది భారత చరిత్రకు నూత్న శోభ కూర్చింది. చల్లని పాలన సాగించింది సమత్వం నెలకొన్నది క్షమా సత్యాంబర జ్యోతుల్ని సంధించింది.

దేశంలో నెలకొన్న అస్తవ్యస్త పరిస్థితుల్ని, అసమానతల్ని, అశాంతి యుత వాతావరణాన్ని వర్ణించి, అతర్వాత దేశస్థితి చక్కబడిన రీతిని జాషువా 'ఈ స్వయంవరం'లో తెలియజేశారు. సమాజ జీవిత ప్రతిబింబంగా సాహిత్యం ఉండాలని, సమాజశ్రేయస్సును సాహిత్యం అభిలషించాలని కలంపట్టిన జాషువా కలంనుంచి వెలువడ్డ యథార్థ భారత దేశచిత్రణమే 'స్వయంవరం'కావ్యం.

గుమ్మా సాంబశివరావు,
తెలుగు లెక్చరర్,
ఆంధ్ర లయోలా కాలేజి,
విజయవాడ 8.

0—0

4వ పేజీ తరువాయి)

ధీయుల ఆ సభ్యమైన చర్యలు హిందూ మతాన్ని వెక్కిరిస్తున్నాయి. ద్వేషం సెగలు కక్కుతోంది. ఆ చర్యలనూ ఆ ద్వేషాన్నీ విరసించడానికి పెద్దనగారు ఈ చంద్రనిందను పణంగా పెట్టుకున్నారు. కొంతవరకూ వాచ్యం (openly) గా కూడా చెప్పడం జరిగింది అవుల్ని చంపేసే తురకలకు దేవుడట ఈ చంద్రుడు.[10] ఆవులు హిందువులకు పవిత్రం. గోహత్య ఒకరికి పాపంకాదు. మరొకరికి పుణ్యంకాదు. గోమాంసం వారికి ప్రకృతి నియతమైన ఆహారం. కానీ అదికాదు పెద్దన చెప్పదలచిన విషయం. హిందూరాజ్యాన్నాక్రమించు కుంటున్న మహమ్మదీయుల నేదో విధంగా నిందించడమే పెద్దన లక్ష్యం. చంద్రనింద అన్నమాటే కానీ ఇది ఒక విరహిణి చేస్తున్న 'చంద్రనింద'లా కనిపించడంలేదు. పురాణగాధలన్నీ వెదికి చంద్రుడేవిధంగా దూష్యుడు (the condemnable) అవుతున్నాడో ఈ పద్యాల్లో చెప్పడం జరిగింది.[11]

ప్రథమాశ్వాసం 18 వ పద్యంలో చంద్రస్తుతి జరిపిన పెద్దనగారే ఒకపాత్ర చేత చంద్రనిందను కూడా చేయించడం కవిత్వంలో రాజకీయనిబద్ధత (poltical commitment in poetry) సృష్టించడంతప్ప మరేమీకాదు. అందుకే కావ్యప్రయోజనాల్లో 'శివేతరక్షతి' (punishing the wicked) అన్నా. 'నిబద్ధత' (committed to punish the wicked) అన్నా ఒకటే అవుతోంది.

చంద్రనింద తరవాతిది మన్మథనింద ఈ నింద కాధారమంతా కుమారసంభవ కథే.[17] ఆ తరువాత వరూధిని మలయమారుతుణ్ణి కూడా నిందిస్తుంది. సంప్రదాయాలూ కవిసమయాలు తెలిసినప్పుడే ఈ పద్యాలు హృద్యాలవుతాయి.[18]

## అధ్యయన సూచికలు

1. 'కోకములు శోచినమ్ములు మనోరథముల్దయివార నిత్తరిన్ తామరతంపరై ప్రియులు తారు విహారము సల్ప వీరిలో నీమెయి దుఃఖితల నగుచే తపింప తరంబె' అంటుంది వరూధిని చెలికత్తెలతో (80 పద్యం)

2. 'పోద మారామమున చూడనందు నూతరంబగు సన్యము' అంటుంది వరూధిని చెలికత్తెతో (80 వ పద్యం)

3 వెన్నెల కేకిని చెప్పడానికి 'పెద్దనగారు' చంద్రాతపము కేకిమి' అని ప్రయోగించారు.

4 'విషమసాయకు తూపుల వివివి వివివి తనువు దొరగంగ దలచి' నట్లు రాగారు పెద్దనగారు (81వపద్యం) వాసన గాలి బాణంగా మారడం, చిగురాకు కార్చిచ్చు కావడం, కుసుమిగ ఉరిత్రాడుగా కనిపించడం, వెన్నెల విషంలా కనిపించడం ఇవన్నీ వరూధిని మానసిక సత్యాలు.

5. చూ. 82 పద్యం.

6. మనసులో లేని తలపుని కూడా ఉన్నట్లుగానే భ్రమకలిగించే కలంలో పుట్టింది నిజానికి వరూధిని. కానీ ఆ కల గాంచవం ఆమెకు ప్రవరుణ్ణి చూసినపుడు గుర్తురాలేదు. ఆమె మనసులో నిజంగానే తలపుపుట్టింది. నిజంగా కామవాంఛ కలిగింది. 'పూతపసిండి వంటి వంపుక్ బచరించు కలంపు నీతిక్ తేతగదమ్మ ఈ తెరగు' అని చెలికత్తెలు గుర్తుచేశారు. అప్సరసలంతా తపోధనుల వెక్కిరిస్తారని వాళ్ల ఉద్దేశం. (33వ పద్యం)

7. 'ఉడుపతి చారికిన్ కరచియూరటయానని పేరటాలునిన్ మండి వడు కంకు సేనలకు మూర్యోలగట్ట' అయినట్టి వనమది.

8. మొల్లు వచ్చి కొట్టడచిన చంద మర్యో అన్నది ఆ ఉపమానం.

9. 36 పద్యం నుంచి 44 వ పద్యం వరకూ చూడండి.

10. 'గోవధము సేయు తురకల దైవంబవు నీవు' 42 వ పద్యం.

11. చంద్రుడికీ యముడికీ ఎన్నో పోలికలు చూపిస్తారు పెద్దన గారు. ఈ పోలికలు శబ్దాశ్రయాలు, అర్థాశ్రయాలు, భావాశ్రయాలు వ్యంగ్య ధోరణుల వల్ల లభించాయి. ఇది ఆశుచిత్ర విస్తర మధుర కవితామార్గాల్లో చిత్ర కవితా మార్గానికి చెందిన పద్యం, ఈ పద్యంలో కీలకమైన అంశమేమిటంటే యముడు ధర్మాన్ని పాటించి ప్రజలను బాధిస్తాడట.' చంద్రుడు ప్రజల్ని బాధించడంలో ధర్మం (justice) పాటించడట. ఇది 37 వ పద్యం.

38వ పద్యంలో చంద్రుడెలా త్రిలోక కంటకుడయ్యాడో చమత్కరించడంలో కవిసమయాలమీదనే ఆధారపడ్డారు పెద్దనగారు 39 వ పద్యంలో చంద్రుడికి వాతాపివంటి రాక్షసుడు గురువని నిందించడం జరిగింది. 40వపద్యంలో చంద్రనిందకు త్రిపురాసుర సంహారగాథ పనికొచ్చింది. 41వ పద్యంలో చంద్రుడు తనతోపాటుపుట్టిన పద్మాలకే శత్రువవడం కవిసమయం చమత్కారం మాత్రమే. 42వ పద్యంలో తురకల దేవుడవడంవల్ల

చంద్రనింద కవకాశం దొరికింది. 43 వ పద్యంలో దక్షాధ్వర కథను వాడుకుని చంద్రుడ్ని నిందించడం జరిగింది. మన్మథుడు అల్లుడుగాగల చంద్రుడు నిందితుడయ్యాడు 44వ పద్యంలో.

12. 'మన్మథుడ్ని శివుడు కాల్చివేశాడని నింద. కానీ రతీదేవి కన్నీటితో ఆ బూడిద చివురించింది. కానీ ప్రయోజనం ఏముంది? విరహంలో ఉన్నవారిని బాధించడం తప్ప' ఈ భావాన్ని మనోహరంగా తీర్చిదిద్దారు పెద్దనగారు తన పద్యపదశిల్పంలో (46వ పద్యం) అగ్నిదేవుడికి కూడా ఒక భార్యఉంది కనుకనూ అతనికి 'కామం' ఉంది కనుకనూ మన్మథుడ్ని బూడిదగా చేయడానికి మోహమాటపడ్డాడన్న వాక్యార్థం మన్మథనిందగా ధ్వనిస్తోంది. పైకిది అగ్నినింద లాగున్నా ధ్వనిమాత్రం మన్మథనిందే। (47వ పద్యం) 48వ పద్యం రసజ్ఞులు చదువుకుని ఆనందించవలసిందే! ఇలాంటి చమత్కారాలు ప్రబంధానంతర కవులకు మార్గదర్శకాలు.

13. అక్కట గంధవాహ తగవా (50వపద్యం) నాలుకలు రెండు నిక్కమే (51వ పద్యం)

(ఇంకా ఉంది)

# శ్రవణానందం - దాపరికం లేని శృంగారం

—డా॥ టి. యస్. భాస్కరరావు

తిరుపతి వేంకట కవులచే (చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు) రచింపబడిన 'శ్రవణానందము' శృంగార రస ప్రధానమైన కల్పిత ప్రబంధం. ఈ గ్రంథం వాద్రేవు వేంకటరత్న మంత్రికి అంకితం ఇవ్వబడింది.

"రాజుల చరిత్రలును గవిరాజు చరితములును గ్రంథమ్ములను
వచ్చె గలుగఁజేయు
నందులో నామనమ్మున కరసి చూడఁ
గవుల కతలను రాజుల కతలు లొచ్చు"
(1-26)

"కావున నేఁదేని యొక కవి చరిత్రంబు శృంగారరస ప్రధానంబై నీతియుక్తంబగునటులఁ గల్పించి యొసర్చుట నాయభిమతంబని చెప్పి బహుమానంబుగా గర్పూర తాంబూలంబు" కృతిపతి వేంకటరత్నమంత్రి అందజేయగా "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా మాయొనర్పంబూనిన కేవల కల్పిత ప్రబంధంబగు శ్రవణానందమ్మునకుఁ గథాక్రమం బెట్టిదనిన" అని గ్రంథం ప్రారంభింపబడింది.

కథానాయకుడు మధుసూదను డనే వైష్ణవ బ్రాహ్మణుఁడు. విద్యా వినయ సంపన్నుడు సర్వ వి. కర్మిష్ఠి. తల్లిదండ్రులకు ఏకైక పుత్రుడు. నాయిక బాలామణి. వేశ్యకుల సంజాత. రూపవతి. విద్యాసంపన్నురాలు. కళావైదుష్యం కలిగిన నవయౌవనురాలు. వీరిరువురిది అనంతపురం. మధుసూదనుడిని బాలామణి మోహించింది అతని పొందుకై తహతహలాడింది. తుదకు తన వేదన తల్లిదగ్గర చెప్పకుంది. బాలామణితల్లి కొన్ని కపటోపాయాలు పన్ని అతనికి బాలామణికి పొత్తు కుదర్చడానికి ప్రయత్నించింది. ఎన్నో సంఘటనలు జరిగిన తరువాత మధుసూదనుడి మనస్సు బాలామణిపై లగ్నమవుతుంది. కొంతకాలానికి ఇద్దరు ఏకాంతసుఖాన్ని అనుభవిస్తారు.

"మదిని విరక్తి దోఁచెనో; సమంజస
మీతని గాదటంచు బు
ద్ధి దిరిగిపోయెనో, మతి పదింబది
పెద్దలొనర్చు నిందకుం
బెదరెనొ యేమొకాని, సరవిం
దదనంతర మాలతాంగి కా
త్రిద్యుఁడయి యాతఁడేగఁ బరదేశ
మొకానొకఁడొ పెవమ్మునన్"
(5-24)

ఆ తరవాత బాలామణి విరహవేదనతో ఆ మధుసూదనుడికి ఒక లేఖ వ్రాయడం, అతడు తిరిగి రావటం, మళ్ళీ ఇరువురూ యథేష్టసుఖాలు అనుభవించడం జరిగింది.

"రాజరాజైన నెంతటి రసికుఁడైన
నెంత గారాము సంగిన నెంతధన మొ
సంగినను జాటున నొనర్చు దొంగ సంగతుల సొనర్పక మానదీ కులటజాతి"
(5-61)

అన్నట్టుగానే బాలామణి తయారవుతుంది. మధుసూదనుడి మిత్రుడొకడు ఈ సంగతి పసిగట్టి మధుసూదనుడిని బాలామణి సాంగత్యంనుండి తప్పిస్తాడు. ఇదీ శ్రవణానందంలోని ఇతివృత్తం.

గ్రంథారంభంలో రెండంశాలు ప్రధానంగా చెప్పబడ్డాయి. 1. శృంగార రస ప్రధానము. 2. నీతియుక్తము. మొదటి అంశం అయిన శృంగార రసపోషణ ఈ వ్యాసంలోని ప్రధానాంశం.

బాలామణి ప్రాథమికావస్థలో తనకి తగిన ప్రియుడిని గురించి తలచుకుంటూ ఉంటుంది. ఆ సమయంలో_

"ముద్దుమాటల ముక్కు మెఱుగ
మెఱుంగనివాని
ధనమేల ? వాని సౌందర్యమేల ?
బంధవ్యవాయ సంపద లెఱుంగనివాని
ధనమేల ? వాని సౌందర్యమేల ?
(1-24)

ఇలా తలుచుకుంటూ సుకవి ఒకరే తొలివాడని భావిస్తుంది. ఇక్కడ 'బంధ వ్యవాయ సంపదలు' అంటే శృంగార బంధాలయొక్క విశేషాలని అర్థం ఈ సమాసార్థానికి అవధిలేదు.

ఓనాడు బాలామణి తల్లి ప్రోద్బలంతో, మధుసూదనుడు ఆమె యింటికి వెడతాడు. వృద్ధవారాంగన ముందుగానే కూతురితో మంతనాలు జరిపి ఉంచింది. బాలామణి మధుసూదనుణ్ణి చేరవచ్చింది.

"ముంగాల సింగార ముంగార మేలు బం
గారు రంగారు అంగా ధరించి
దబ్బకాయలఁజూచి యబ్బగారని పిల్వ
గబ్బి గుబ్బలఁ గంచుకమ్ము దొడిగి'
(2-11)

ఇంకా పలురకాల సోయగాలతో మధుసూదనుణ్ణి చేరవచ్చింది.

"పైఁట దొలంగి పాదముల పైఁబడ
గాజులు మ్రోయ సర్వదే
శాటన పావనంబగు ధరామరు
పాదసరోజయుగ్మ మా
బోటి నమస్కరించె నలపుష్పశరాసుఁడు
బాణ పజ్క్తికిన్
మాటకు గాక తాగిరట పైచిన
చాపమునంగ నత్తఱిన్"
(2-12)

సీసపద్యంలో బాలామణి ఆకృతిని చిత్రీకరించి, ఉత్పలమాలలో ఆమె చేష్టలు వర్ణింపబడ్డాయి. పైట తొలగి పాదాలపై బడగా ఆమె వంగి నమస్కరించింది. ఇది హృదయైకవేద్యమే కాని వివరించి చెప్పడంవలన యదార్థ భావాభివ్యక్తీకరణ జరగదు.

"కాసుల నిత్తు మంచు వరకాసుల
నిత్తుమటంచు వత్సర
గ్రాసము వచ్చు భూముల నొకానొక
నిద్రకె యిత్తుమంచు"
(2-27)

ఎందరో ఈవిధంగా వెల చెల్లిస్తామంటే నా మనస్సు అంగీకరించడంలేదు. నా కూతురుకూడా ఇష్టపడటంలేదు. ఆమె మీపైనే మక్కువ పెంచుకొని ఉంది అని మధుసూదనుడితో అంటుంది వృద్ధవేశ్య. విటుడికి ఇంతకంటె దురవస్థ మరేవిధంగాను నిరూపించలేం, ఈపద్య పాదాలు పరిశీలిస్తే.

ఇలా శృంగారరస సంబంధి భావాలు శ్రవణానందం అంతటా ఇబ్బడిముబ్బడిగా కనిపిస్తాయి. కొన్ని పద్యపాదాలని యథాతథంగా ఆకారాలతో సహా ఇస్తున్నాను.

"వచ్చియు రాని గుబ్బల వల్కుల గుబ్బె
తలను శోధనములు సలుపువారు"
(2-66)

"సురత నైపుణ్యముల మది జొన్పు రసిక
వరుల కందఱు మాతిరువాతఁ గాద"
(2-80)

"అతికఠిన ప్రయాసమున నార్జనఁ జేసిన
కామశాస్త్ర మే
గతి చరితార్థమౌను......
......బరరాముల కింతటి కాలమున్నదే?
వితయగు గాదె? లక్షణవివేకము
లక్ష్యమెఱుంగకుండినన్"
(2-84)

"యిందటి కన్నెలకమ్మ తుదముట్టెనో,
లేదా
మీనాక్షి కట్టించు మేడఁ జూడు
(2-96)

"తైక దాఁటి నాం బవరసు కండవా
దాఁటి
గబ్బిగుబ్బల కాంతి గంతులిడఁగ
గాగరా దాఁటి పైఁగట్టు పుట్టము దాఁటి
తొడల యందం బడావడి నొనర్ప"
(3-25)

"—సెటువంటి వాఁడైనఁ గాని రాత్రి
యేకతమ్మున స్త్రీగాలి సోకనేనిఁ
తత్తఱంబొంది పరవశాయత్తుఁడగుమఁ
గోర్కులిసుఱొత్తఁ బైఁబడఁ గోరకున్నె?
(3-30)

"మన కిది వలకే కలదని
జను లెల్లరుఁ జెప్పుకొనఁగ సాఁగిరి కాదే?"
(3-48)

"కలికిరో! మెత్తనై యలరు నీమేనొక్క
సారి గిల్లవఁ బాలు గారకున్నె!
యబలరో! మించుపై యలరు నీమాపులు
సోకినంతనె మది చొక్కకున్నె!
బాలతిరో! మృదులమై యలరు నీకెమ్మోవి
నొక్కినంతనె తేనె చిక్కకున్నె!
చెలియరో! నీదు కౌగిలి యుక్కతృటియైన
బడసిన రసపుట్టిపడక యున్నె!"
(3-61)

"జాతిపోయిన నీవి సవరించి సవరించి
కలంప గుబ్బల పైకఁ గుదురుపరచి"
(3-80)

"ఉపరతి క్రీడా మహోత్సవాలస కామి
నీవచస్థల ఘర్మనీరముడిపి"
(3 93)

"అజ్ఞాత గాత్ర భేద జ్ఞాన విలసనంబు
బనలిత రతి రసాస్వాదమంబు
అనిరుద్ధ దంతచ్ఛదా మృతా స్వాదనం
బప్రయత్నాప్త బంధానుగమము
అనిమిత్త తాడనాన్యోన్య సంభృత సుఖం
బక్షీణ పూర్ణమోదానుభవము
అనుపమ సంవృతవచః ప్రారంభ సంరంభ
మనివార్య ఘర్మోదకావతార
మవిదిత నఖక్షత వ్యథం బప్రమేయ
రస విశేష ప్రసార మరాళ చేష్ట

మని యతాలింగ సాధ్య మవ్వనజగంధి
భ్రమర నిభువన మక్కరి భ్రమరఁ జెనసె''
(4-102)

''చూచు నే మెఱుఁగౌ విగ్రహోటు
అంచును మధ్య
మధ్యఁ గాఁగిటఁ గొక్కు మాఱుఁ జేరఁ
గోపగించునో యంచుఁ గులుకు
గుబ్బల మధ్య
మధ్యఁ జేతుల గొక్కు మాటో సంగు
బరిహసించునో యంచు బల్
రయమ్మున మధ్య
మధ్య నాటక యొక్క మాఱు పెనఁగు
శ్రమఁ జెందునో యంచుఁ జపులు
దేలఁగ మధ్య
మధ్య నోష్ఠ మొక్క మాఱో సంగు
ముద్దులిడి యొడలెఱుఁగమి మోహఁ
గొలుప
బహుల తీర్చె నెయ్యని చేరఁబట్టు లోమ్మ
రాజ్యమిది నాదియఁచు గర్వమ్ముఁ జూపు
మపరతి మొనర్చె శశి వదన్యావిధ మిన్న''
(4-108)

''రావిడి గబ్బి గుబ్బల నురమ్మునఁ
గ్రుమ్ముచుఁ గోర్కె తేపుచుం
గోపము లేకయే కసరి కొట్టుచు
"నోచ్చితి" వంచు వింతలం
బాపుచు ముద్దుపెట్టుచును సొంపుగ
నవ్వుగ మెత్తి చూచు నీ
చూపుల కియ్యగా వలదె ? సోలెదు
పద్మము లందుజావనా''
(5-49)

''సముఖమునఁ జేరవచ్చి బిగిచన్నుల
గ్రుచ్చి కవుంగిలించి ప్రా
యము తమిఁ జూపుచుం దమలపాకుల
చిల్కలు నోటఁ బెట్టుచున్
దమకము మీఱ నన్ను వరతమ్మున
బోలఁగఁ జేయఁబట్టి భ
క్రమగల నాఁటి రోజు లిఁక రాఁదిక
రాదిఁక రావు నెచ్చెలీ''
(5-50)

గడచిన శతాబ్దంలో వీరేశలింగం పంతులు గారు వేశ్యాలోలత్వాన్ని తీవ్రంగా ఖండించేవారు. ఆయన ఎన్నో ప్రహసనాలు ప్రాసారు. ఈ వేశ్యాలోలత ఆ రోజుల్లో మీదుమిక్కిలి ఉండేది. తిరుపతి వేంకటకవులు ఈ ఇతివృత్తానికి కావ్యత్వం కల్పించారు. తిరుపతి కవులు సంప్రదాయబద్ధులు. అయినప్పటికీ సంస్కరణ భావాలు కలిగిన వారనడానికి ఈ కావ్యమే ఓ చక్కని దృష్టాంతం.

''కవులు నూతను లనియును, గత నవీన
మనియు నాక్షేపణ యొనర్తురంచు మేము
కొంచె మెఱుఁగుదు మైనను 'గ్రొత్త క్రొత్త
కొమ్మన' యటన్న నా మెత నమ్మినాము''
(1-14)

''తనకు నల్లు నిఘంటు పదములు వచ్చు
ననుచుఁ బలిమందికిఁ దెలియంగ మాఱు
మాల పదములు గుప్పిన మెచ్చటగునె?
ప్రతిపదమ్మున రసపుష్టిపడినఁ గాక''
(1-12)

అని చెప్పుకున్నారు. అలాగే ప్రబోధాన్ని ప్రధానాశయంగా చేసుకునే నాయికా నాయకుల ధోరణులు సహజ రీతిలో వర్ణించారు.

వేశ్యని నాయికగా చేసి రచించిన లఘుకావ్యాలు ప్రాచీన సాహిత్యంలో చాలా ఉన్నాయి. వేశ్యని వలచిన రాజుకి, ఆమెకి ఇతివృత్తం అతికించడం తప్ప అందులో ప్రబోధం ఏమీ ఉండదు.

తిరుపతి కవులు నవ్యమైన ఇతివృత్తాన్ని గ్రహించి దానిని సంప్రదాయ కవితాస్వరూపంలో వ్యక్తీకరించారు. భాషావిషయకంగా అధునికతకు చోటిచ్చారు. ''సంస్కర్త ప్రాచీనత్వముపై ద్వేషముండదు. కాని, యది యెప్పుడు చైతన్యరహితమై నిరర్థకమగునో అప్పుడు దానిని తత్త్వసమయోచిత ప్రయోజన సాధన సమర్థమగునట్లు సంఘప్రేమికుడు పరిష్కరించి మార్చును''. (శ్రవణానంద పాఠ్యగ్రాహికలు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం–నవ్యాలోకం–పుట 87)

మద్రాసు-ఆంధ్ర రాష్ట్రాలు సంయుక్తంగా ఉండే సమయంలో ఈ గ్రంథం ప్రభుత్వ నిషేధానికి గురి అయింది. ఆ రోజుల్లో ప్రభుత్వ నిషేధాజ్ఞలకి గురి అయిన పుస్తకాలు చాలా ఉన్నాయి. ఇలా నిషేధింపబడటానికి కారణాలు కూడా చాలా ఉన్నాయి. శ్రవణానందంలో శృంగారం అతిగా ఉందనేది ఒక కారణంగా చూపింది ఆనాటి ప్రభుత్వం. ప్రాచీన సాహిత్యం త్రవ్వితే ఇంతకంటె ఎక్కువగా శృంగార భావాలు కన్పిస్తాయి.

కాళ్ళకూరి నారాయణరావుగారు ఈ సాంఘిక దురాచారాన్ని ఇతివృత్తంగా స్వీకరించే చింతామణి నాటకాన్ని రచించారు. అది ఈనాటికీ ఆంధ్రదేశం అంతటా ఆదరణలో ఉంది.

శ్రవణానందాన్ని పాఠ్యభాగంగా నిర్దేశించి చెప్పడం కొంచెం కష్టం.

వేశ్యాసాంగత్యంవలన ఎలా పాడవుతారనే విషయం ప్రధానంగా తిరుపతి కవులు ఈ గ్రంథాన్ని రచించారు. దీనిని చదివి పదిమందైనా బాగుపడతారని ఆశించారు. కాలాన్ని అనుసరించి భాషను ఉపయోగించారు. గ్రాంథికాన్ని విడవకుండా వాడుక భాషాపదాలకి తావిచ్చారు. ఆనాడు శ్రవణానందం చదవని వ్యక్తి లేడు. శృంగారరస ప్రబంధం అయినప్పటికీ సంపూర్ణంగా సంస్కరణాత్మకమైనది. వీరు చేసిన మానసిక భావవిశ్లేషణ కూడా శృంగారాన్ని మరుగున పడేసేటంతగా ఉంటుంది.

* * *

జి. యస్. భాస్కరరావు,
తెలుగు విశ్వవిద్యాలయం,
బొమ్మూరు.

0...0

## వినాయక చతుర్థి

—శ్రీ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి, ఎం. ఏ., ఎం. ఫిల్.,

చం. గగనము నంటు పందిరులు,
కండ్లు జిగేల్మను పేలదీపముల్
పగలును రేయి యర్చనలు,
పావనముల్ పదపప్పు. లద్భుతం
బగు హరినామ కీర్తనల
యార్పటు లాఁగని యన్నదానముల్.
నగ తనయా సుతుఁడు గణ
నాథుని యుత్సవవేళ లందువన్.

మ. జగదారాధ్యుని, భక్తపాలన కళా
చాతుర్య సంభావితున్.
నగరాజాందన కూర్మి పుత్రకుని, నా
నా విఘ్న జాలాధిపున్.
భగవామన్. సుమనో
మనోఽంబురుహ భా
స్వంతున్, గజాస్యున్ చిరం
బుగఁ గీర్తింతుము భక్తి పీ దినములన్
బూజింతు నశ్రాంతమున్.

చం. సురుచిర భవ్య భాద్రపద
శుద్ధ చతుర్థిని భక్తియుక్తులై
సుర ముని బృందసేవితుని,
శూర్ప సమాన విశాల కర్ణునిన్.
బరమ శివాగ్రనందనుని,
ఫాల శశాంకుని, విఘ్ననాయకున్,
గరిమను గొల్వ వారలకుఁ
గల్గు శుభంబు లనేకమ్ముగన్.

చం. హరిహర బ్రహ్మ సంస్తుత మ
హత్త్వ యుతుండవు, సర్వదేవతా
పరివసితుండ, వర్థి జన
పాళికి ముంగిటి కల్పశాఖి, వా
గిరిశుని కూర్మి పుత్త్రుఁడవు.
కేవల తత్త్వపరుండ పట్టి నిన్
గరిమను భక్తిఁ గొల్చెదను
గామితముల్ సమకూర్చ వేఁడెదన్.

* * *

పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి,
చింతలపాటివారి వీధి,
అరుండల్ పేట,
న ర స రా వు పే ట,
గుంటూరు జిల్లా.

......—......

ఉత్తమ సాహిత్యంకోసం
సమాలోచన
చదవండి!
చదివించండి!!

## ద్వా. నా. శాస్త్రికి స్వర్ణపతకం

అమలాపురం, ఎస్.కె.బి.ఆర్ కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా పని చేస్తున్న శ్రీ ద్వా. నా. శాస్త్రికి తెలుగు విశ్వవిద్యాలయం "డాక్టరేట్" (పిహెచ్‌డి) ప్రదానం చేసింది. ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారి పర్యవేక్షణలో "తెలుగు భాషా సాహిత్యాలకు సాహితీ సంస్థల సేవ" అనే అంశంపై ఉత్తమ పరిశోధన చేసినందుకు తెలుగు విశ్వవిద్యాలయం ద్వితీయ స్నాతకోత్సవంలో ఛాన్సలర్, గవర్నర్ శ్రీ కృష్ణకాంత్ శ్రీ ద్వా. నా. శాస్త్రికి స్వర్ణపతకం బహూకరించారు. ఆచార్య దోణప్ప, ఆచార్య రామబ్రహ్మం, వివిధ సాహిత్య సంస్థల నిర్వాహకుల సహకారంతో పరిశోధన చేసిన శ్రీ ద్వా. నా. శాస్త్రి- వాఙ్మయలహరి, సమాధిలో స్వగతాలు, సాహిత్యసౌహిత్యం, మారేపల్లి రామచంద్రశాస్త్రి కవితా సమీక్ష, వ్యాస ద్వాదశి అనే రచనలుకూడా చేశారు.

(000)

రచనలు వ్రాత తప్పులు
లేకుండ, చదవడానికి
వీలుగా స్పష్టంగా
ఉండాలి.

Editor, Printer and Publisher B. Ravikanth at B. V. & Co. Press,
Tyagaraja Nagar, Rajahmundry-533 101.